# అభిసారిక

## చందాదారులుగా చేరండి



అభిసారిక మాసపత్రిక సం॥ చందా రు 18-00 ప్రత్యేక ప్రచురణలతో కలిపి సం॥ చందా రు 36-00 అయితే అభిసారిక ప్రత్యేక ప్రచురణలతో సహా శాశ్వతంగా పొందగోరు వారు అభిసారిక శాశ్వతచందా రు 120-00లు పంపినచాలును.

నేటికి చాలామంది శాశ్వత చందాదారులుగాచేరారు. మీరూ చేరండి.

సెక్సుసమస్యలతో సతమతమవుతూ మాతో సంప్రదించవలసినవారు తూర్పుగోదావరిజిల్లా, కాకినాడ తాలూకా సామర్లకోట రైల్వేస్టేషనులోదిగి, అయోధ్యారాంపురంలోని మా కార్యాలయానికి రావచ్చును. ఉదయం 8 గంటలనుండి సాయంత్రం అయిదు గంటలదాకా మా కార్యాలయం తెరిచి ఉంటుంది.

—మేనేజర్

## సగం ఖరీదుకే

## 1976 సం॥ అభిసారికలు

ఎన్నో అతి ముఖ్యమైన సెక్సు విజ్ఞాన వ్యాసాలతోను, పాఠకుల సెక్సుసమస్యలకు సమాధానాలతోనూ వెలువడిన 1976 సం॥ అభిసారికలు కొద్ది ప్రతులే ఉన్నాయి. రు 7-50 మనియార్డర్ పంపినవారికి పై అభిసారికలు పంపుతాము. నేడే మనియార్డర్ చేయండి.

మేనేజర్: అభిసారిక, సామర్లకోట 533 440

## అపూర్వ గ్రంథాలు

మావద్ద ఈ దిగువ అపూర్వ దాంపత్య విజ్ఞానగ్రంథాలు లభిస్తాయి. కావలసినవారు వెంటనే మనియార్డర్ చేయుగోరుచున్నాము. రిజిష్టర్డుపోస్టేజీ రు 2-00 అదనం.

1. రతిరహస్యం అనే కొక్కోకం రు 4-00
2. కామశిల్పం నాలుగుభాగాలు రు 6-50

మేనేజర్, అభిసారిక, సామర్లకోట 533 440

# ఉత్తరాలు

మార్చి నెల అభిసారిక చాలా బాగుంది. ఓటు ఎవరికి?— అనే మీ సంపాదకీయం నిష్పక్షపాతంగా ఉంది. మనోవ్యాధులకు మందులున్నాయని తెలియబరిచినందుకు సంతోషం. మీ నీతిశాస్త్రం నేటి యువతరానికి క్రిమిశిక్షణ! నీతికీ, కామానికీ మీరు సత్సంబంధాన్ని నెలకొల్పటం ప్రశంసనీయం. పురాణపురుషుల కథలు మన సంఘంలో జరుగుతున్న మార్పుల్ని చెప్తున్నాయి. విధి చేసిన వంచన కథ యువతీయువకులకు మేలుకొలుపు. లైంగికసమస్యల్ని చక్కగా వివరించారు. సంస్కారం విసిగెత్తిస్తోంది. విచ్చీవిచ్చనిమొగ్గ చదవ బారుగాఉంది. అడగండిచెపుతాను సంఖ్య బాగా పెంచమనికోరిక.

—గోవర్ధన్, కొడకండ్ల.

"చచ్చినా స్వర్గానికి వెళ్ళకండి" (ఫిబ్రవరి 77) అవహేళనగాఉంది. ఒకవేళ వ్యంగ్యరచన అనుకున్నా సున్నితమైన హాస్యంలేదు.

—వై. కె. జె. దొర. సికిందరాబాద్.

"లైంగికసమస్యలు" (మార్చి 77) చాలా బాగుంది. చక్కని యెన్నో తెలియని విషయాలను తెలియబరిచారు.

—లోకబాంధవ, మచిలీపట్నం

"స్త్రీకి రాగంకన్నా అనురాగం యెక్కువగా ఉంటుంది; పురుషుడికి అనురాగంకన్నా రాగం యెక్కువగా ఉంటుంది. కనుక పురుషుడి ప్రేమకు శాశ్వతంలేదు; ...వైవాహిక జీవితంలో శారీరిక సంబంధం విషయంలోనే గ్యారంటీఉంది గాని, ప్రేమవిషయంలో గ్యారంటీలేదు. లైంగికసమస్యలు మార్చి 77)లో చెప్పిన మాటల్ని నేను మరిచిపోలేకపోతున్నాను. నా అనుభవం మీ మాటల్ని రుజువుచేసింది.

—కమల, హైదరాబాద్

"వధువు దృష్టిలో వరుడు మొదట్లో రాజకుమారుడిలా కనిపిస్తాడు. వరుని దృష్టిలో వధువు ఊర్వశిలా కనిపిస్తుంది. కాని, పెళ్ళయి కొన్నేళ్ళు గడిచేసరికి ఊర్వశిలాంటి ఆ భార్య శూర్పణఖలా వికృతంగా కనిపిస్తుంది. ఆ రాజకుమారుడు బట్టతలతో పిప్పళ్ళబస్తాలా తయారవుతాడు. వచ్చిన ఇబ్బంది ఏమిటంటే ఆ పిప్పళ్ళబస్తా తన సంగతి చూచుకోడు. తన ఊర్వశి శూర్పణఖ అయిపోయిందే అని ఏడుస్తాడు." అంటూ మార్చి 77 సంచికలో "లైంగిక సమస్యలు" అన్న వ్యాసంలో మీరు నిజాన్ని తెలియజెప్పారు. మీకు మా ధన్యవాదాలు.

—రమేష్, రాజనాల.

"సంస్కారం" నవల అద్భుతంగాఉంది. ఇంత మంచి నవలను అందిస్తున్నందుకు మిమ్మల్ని ప్రశంసించకతప్పదు.

—కామేశ్వరి, సుబ్బారావు వగైరా

---

చదవండి—

# కామశిల్పం నాల్గవ భాగం

ఈ గ్రంథంలో ఈ దిగువ సందేహాలకు సమాధానాలు లభిస్తాయి

1. భార్య వెల్లకిలా పరుండేపద్ధతిలో రతి జరిపినందువల్ల కలిగే నష్టాలేమిటి?

2. నూత్న వధూవరులు పార్శ్వపద్ధతిని రతి జరిపినందువల్ల కలిగే లాభాలేమిటి?

3. బీజవాహికలోని వెచ్చదనం పురుషాంగాన్ని ప్రకోపించి శీఘ్రస్ఖలనానికి దారితీయకుండా నివారించే విధానంయేది?

4. బీజవాహికాస్రావాలు పురుషాంగానికి ప్రేరణ కలిగించకుండా ఎలా కాపాడుకోవాలి?

5. మగవాడికి కలిగే ఆవేశాన్ని తగ్గించుకునే విధానమేది?

6. 'సంప్రయోగవిశ్వాసాన్ని' సాధించుకోవటం ఎలా?

7. భౌతికదోషాలను సవరించకుండా మానసికదోషాలను సవరించలేమా?

8 పెరీనియల్ కండరాలను సడలించటంద్వారా ఇంద్రియ నిగ్రహాన్ని సాధించటం ఎలాగ?

9. పెరీనియల్ కండరాలను రతిసమయంలో బిగించటంవల్ల కలిగే అనర్థమేమిటి?

10. ఈత, రతి ఒక్కలాంటివేనా?

11. ఉపరతిని నిర్వహించటం ఎలాగ?

12. సంపాదానం అవసరమా?

13. రతి జయప్రదం కావటానికి అనుసరించవలసిన పద్ధతి యేమిటి?

14. నీగ్రోజాతులు వైనతవిధాన్ని అనుసరించటానికి కారణమేమిటి?

15. గర్భిణీస్త్రీలతో వైనతవిధానాన్ని అనుసరించవచ్చా?

16 స్త్రీ మూత్రద్వారానికి కామప్రేరకశక్తి ఉందా?

17. వైనత పార్శ్వపద్ధతిలో రతిని జయప్రదంగా నిర్వహించటం ఎలాగ?

18. యురెత్రల్ ఎరోటిజమ్ అంటే ఏమిటి? దానిని ప్రేరేపించటం ఎలాగ?

19. "రతివేగం" ఎందువల్ల పనికిరాదు?

20. స్త్రీ మూత్రనాళంలో కలిగే కామప్రేరణ చల్లారక పోవటంవల్లనే మూత్రవ్యాధులు సంక్రమిస్తాయా?

ఇంకా ఎన్నో దాంపత్యవిజ్ఞానానికి సంబంధించిన ప్రశ్నలకు ఈ గ్రంథంలో జవాబులు లభిస్తాయి. అభిసారిక ఏజెంట్ల దగ్గర దొరుకుతుంది. లేనిచో నేడే మేనేజర్, అభిసారిక, సామర్లకోట 533·440 అను ఎడ్రెస్‌కు వ్రాయండి.

వెల: రు 1-50 మాత్రమే.

# అభిసారిక

ఏప్రిల్–మే 1977
సంపుటి 17
సంచిక 4-5


---

## సంపాదకీయం

అనుకున్నంతా అయింది. ప్రజలు నిరంకుశత్వాన్ని తోసిపారేశారు. పత్రికలపైనా, ప్రజలపైనా, ప్రతిపక్షం పైనా ఇన్నాళ్ళూ పాలకపక్షం సాగించిన జులుం ఇప్పుడు తొలగిపోయింది.

పూర్వపు పత్రికాస్వాతంత్ర్యం మళ్ళీ లభించింది. పత్రికలపై పోలీసువారు చట్టవ్యతిరేకచర్యలు జరపటానికీ, అన్యాయమని ఎదిరిస్తే 'మీసా'లు మెలివేయటానికీ ఇంక అధికార లేదు.

తిరిగి ప్రెస్ కౌన్సిలు ఏర్పడింది పత్రికలకు సంబంధించి సంతవరకూ ఏ ఆరోపణలున్నా విచారించేఅధికారం పూర్తిగా ప్రెస్ కౌన్సిలుకే ఏర్పడింది. ప్రభుత్వంకూడా దానికి ఫిర్యాదు చేసుకోవలసిందే.

ఏ పోలీసుఆఫీసరయినా ఇదివరకటివలె పత్రికల్ని స్వాధీనం చేసుకుని పత్రికలమ్మే న్యూస్ ఏజెంట్లపై కేసుపెట్టే అధికారం ఇప్పుడు లేదు. పైగా అలాంటి ఏపాటి తప్పువనిచేసినా అత

నిపై అధికారదుర్వినియోగం నేరానికి సివిలు క్రిమినలుచర్యలు జరిపి, నష్టపరిహారాన్ని రాబట్టుకునే అధికారం ఈనాడు పత్రికలకు దత్తమయింది. ప్రజాభిప్రాయానికి మా ధన్యవాదాలు.

మా విజ్ఞప్తిని పురస్కరించుకుని భూరివిరాళాలు పంపిన సోదరసోదరీమణులందరికీ మా కృతజ్ఞతాంజలి. వారి ఆశీస్సుల మేరకు "అభిసారిక" ఈ స్వేచ్ఛావాతావరణంలో మరింత శ్రద్ధాసక్తులతో కృషిచేయగలదని హామీ యిస్తున్నాం.

అలనాటి ప్రమాణాన్ని మళ్ళీ చేస్తున్నాం.

'భావస్వాతంత్ర్యం మన జన్మహక్కు. ఏ శక్తీ మన ఈ స్వాతంత్ర్యాన్ని అణచటానికి అనుమతించం.'

—ఎడిటర్.

---

## ముఖ్య ప్రకటన.

కొన్ని అనివార్య కారణాలవల్ల ఏప్రిల్ అభిసారికను రద్దుచేసి, ఈ సంచికనే ఏప్రిల్-మే అభిసారికగా ప్రచురిస్తున్నాం.

—మేనేజర్

---

# మానవాతీత జన్మలు

మనమెరిగినంతవరకు గర్భోత్పత్తికవకాశములు కల్గించునది శుక్లము. శోణితముల కలయిక. దీనికి స్త్రీపురుషుల సమాగమము ఆధారమవుతుంది. స్త్రీ పురుషసంగమంలో విడుదల చేయబడిన శుక్లశోణితములు పిండోత్పత్తి కవకాశము కల్గించి ఆ పిండమే పదినెలలు తల్లి గర్భమునందుండి తర్వాత జన్మించుట— ఇది మనకు తెలిసిన గర్భోత్పత్తిక్రమము— జన్మక్రమం కూడా. కాని ఇందుకు పూర్తిగా విరుద్ధముగానున్న జన్మక్రమములు కొన్ని చూతము.

ఈ పుట్టుకలు మన పుట్టుకలవంటివిగా కనిపించుటలేదు గనుక వీనిని మానవాతీత జన్మలుగా భావించుట కవకాశము కలుగుచున్నది. ఇవి అనేక విధాలు.

## సద్యోగర్భాలు

1. తల్లి పదినెలలూ గర్భాన్నిమోసి తరువాత ప్రసవించుట మనమెరిగిన పద్ధతి. కాని దీనికి విరుద్ధంగా స్త్రీపురుష సమాగమం జరిగినవెంటనే శిశుజన్మ కలుగుట ఈ సంఘటన భారతం ఆదిపర్వంలో అనేకమంది విషయంలో కన్పించుతుంది వ్యాసుడు ఈ విధంగానే జన్మించాడు. మత్స్యగంధి దాశరాజు కుమార్తె. ఆమె ఓడనడుపుతుంటుంది. ఒకనాడామెను పరా

శరుడు చూశాడు. తనకు ఆమెమీద కలిగిన మోహాన్ని తెలి యజేశాడు. ఆయన మునిగదా! అంగీకరింపకపోతే ఏమవు తుందోననే భయంతో ఆమె అంగీకరించింది. వెంటనే వ్యాసు డు జన్మించాడు. ఆయన సద్యోగర్భంవలన- అనగా పదినెలలూ మోసేపనిలేకుండా వెంటనే- పుట్టాడని అర్థం. ఆదిపర్వంలోనే కర్ణుడుకూడా ఇలానే జన్మించాడు. అయితే ఇతడు పుడుతూనే చెవులకు కుండలాలూ, శరీరానికి కవచంకూడా కలిగిఉన్నాడట ఇది చాలా చిత్రం.

## స్త్రీ అవసరం లేకుండానే....

2. సమాగమం లేకుండానే అసలు స్త్రీతోకూడా పని లేకుండానే పుట్టినవాడు ద్రోణుడు. ద్రోణుని తండ్రి భరద్వా జుడు. ఒకనాడు భరద్వాజుడు గంగలో స్నానం చేస్తున్నాడు. అదే సమయంలో ఘృతాచి అనే అప్సరసకూడా స్నానం చేస్తూంటే ఈయన చూశాడు. (ఆమెకు గుడ్డ తొలిగింది) ఆయనకు కామాతిరేకంతో వెంటనే స్ఖలనమయింది. ఆయన స్ఖలనమయినదాన్ని ఒకద్రోణంలో భద్రపరిచాడు. దానిలో నుంచి పుట్టాడు ద్రోణుడు. ద్రోణుడు అంటే, ద్రోణము- దొన్నెలోనుండి జన్మించినవాడని అర్థం. ఇది మరీ చిత్రంగా లేదూ!

ద్రోణుడువలెనే కృపాచార్యుడూ తల్లి లేకుండానే

జన్మించాడు. కృపాచార్యుడి తండ్రి స్ఖలించిన వీర్యం రెల్లు దుబ్బులో పడింది. దాన్నుంచే కృపాచార్యుడూ, కృపి అనే అమ్మాయికూడా జన్మించింది. ఇక్కడ ఆడపిల్ల జన్మించటం కూడా విశేషమే ఇలానే కుమారస్వామికూడా రెల్లుదుబ్బుల్లోనేజన్మించాడు. అందుకే ఆయనను శరవణభావుడు అన్నారు అంటే రెల్లుదుబ్బులోపుట్టినవాడని అర్థం ఇంద్రియం ద్రోణ్ణిలో ఉంచినా రెల్లులో పడినా దానిలోనుంచి సంతానం కలగడం విచిత్రమే. ఇవన్నీ ఆదిపర్వంలోనివే.

## కృత్రిమ గర్భధారణ

3. వ్యాసుడి పుట్టుకకు కారణమైన మత్స్యగంధి ఎలా జన్మించిందో చూదాము. ఉపరిచరుడనే వసువు ఒకాయన ఉన్నాడు. ఆయన భార్యపేరు గిరిక. గిరిక ఋతుస్నానం చేసిన నాడు ఆమెకు మృగమాంసము తెచ్చిపెట్టవలసినదని ఆయన పితృదేవతలు ఆజ్ఞాపించారు. అయన వేటకువెళ్ళి అరణ్యంలో తన భార్య అందచందాలు తలచుకొంటూఉంటే ఆయనకు స్ఖలనమయింది ఉపరిచరుడు దాన్ని ఆకులో జాగ్రత్తగాఎత్తి తన పెంపుడు డేగ మెడకుకట్టి దాన్ని తీసుకొనివెళ్ళి తన భార్య కిమ్మన్నాడు. ఆ డేగ ఆకాశంలో పోయే సమయంలో ఒక గ్రద్ద దాన్ని చూచింది. దాని మెడకున్న ఆకునుచూచి మాంసమనుకొని దానితో యుద్ధానికిదిగింది. ఆ సంఘర్షణలో

అ ఆకులోని వీర్యం రెండుచుక్కలు క్రిందప్రవహించే యమునా నదిలో పడింది. దాన్ని ఒక చేప మ్రింగగా దాని గర్భంలో నుంచి ఒక చక్కని బాలికవచ్చింది. ఆమే మత్స్యగంధి. ఇక మత్స్యగంధి విషయంలో మనం రెండు విషయాలు చూడాలి. మొదటిది శుక్రశోణితాల కలయికలో శోణితం లేకుండా గర్భోత్పత్తి కావడం. అదికూడా శుక్రాన్ని మింగటంద్వారా చేపకు గర్భం కలుగుట. ఇక రెండవది నీటిలో కలిసిన శుక్రాన్ని త్రాగినా గర్భం రావటం. ఆధునిక గర్భనిరోధకులేమంటున్నా రంటే గర్భోత్పత్తికి ఆధారమైన శుక్రకణాలకు నీరుతగిలితే అవి వెంటనే చచ్చిపోతాయిఅని కాని మత్స్యగంధిపుట్టుకకు కారణమైన చేప నీటితో కలిసిన శుక్రాన్ని త్రాగినా దానికి గర్భంరావటం. ఇందులో ఇంకొక విచిత్రమేమిటంటే గర్భోత్పత్తికి కారణమైన శుక్రాన్ని జననాంగంద్వారానేగాక నోటిలోగుండా లోపలికి పంపినా గర్భం రావటం. ఇదీ చాలా చిత్రంగాలేదూ। ఇంతకంటే మరీచిత్రమైన విషయం ఇంకొకటి చూద్దాము. అది శుక్రాన్ని నోటితో మింగటంకాక కేవలం ముక్కుతో వాసనచూస్తే గర్భోత్పత్తి కావటం ఇది చాలా ఆశ్చర్యకరం. ఊహాతీతంగూడాను. అదేమిటో చూద్దాము.

## తల్లిని తెచ్చిన కొడుకు

4. [illegible] దగ్గుపల్లి దుగ్గన అనే కవి 'నాసికేతో

పాఖ్యానము' అన్న గ్రంథంలో రాశాడు. బ్రహ్మ మానస పుత్రుల్లో ఒకడైన ఉద్దాలకమహర్షి బ్రహ్మను గురించి తీవ్రముగా తపస్సు చేశాడు. ఆయనకు బ్రహ్మ ప్రత్యక్షమై పెళ్ళి చేసుకొని వంశాన్ని ఉద్ధరించమని హితవుచెప్పాడు. కాని మహర్షి మాత్రం తనకు సంసార ఝంజాటం వలదని బ్రహ్మచారిగానే ఉండిపోతానన్నాడు. అలా వద్దన్నాడు బ్రహ్మ. అయినా తన మాటకు తిరుగులేదని పట్టుపట్టాడు మహర్షి. చివరకు బ్రహ్మ ఉద్దాలకునుద్దేశించి ఇలా అన్నాడు. నీవు నేను ఎంతచెప్పినా వినటంలేదుగదూ? మర్యాదగా పెళ్ళిచేసుకొని పిల్లల్ని కనమంటే కాదంటున్నావుగదూ సరే. నీకు పుట్టిన కొడుకే నీ భార్యను నీదగ్గరకు తీసుకువస్తాడులే అని వెళ్ళిపోయాడు. దానికి ఉద్దాలకుడు మా నాయనకు వయసుతోపాటు బుద్ధిమాంద్యంకూడా పెరిగింది లేకపోతే నాకు భార్యలేకుండా పుత్రుడు పుట్టడమేమిటి? అని నవ్వుకున్నాడు. తన దారిన తను తపస్సు చేసుకుంటున్నాడు. తరువాత ఒకనాటి తెల్లవారుజామున ఉద్దాలకునికి ఒక చక్కని అమ్మాయి కలలో కనిపించింది. ఆయన కలలోనే చేయవలసినదంతా చేశాడు. స్ఖలనం కాగానే మెలకువవచ్చింది. ఆయనకు ఏమిచేయటానికి పాలుపోక స్ఖలనమయిన వీర్యాన్ని ఒక పద్మంలో పెట్టి దాన్ని పద్మంలోని రేకులతోనే జాగ్రత్తగా కప్పిపెట్టి నీటిలో వదిలాడు.

## వీర్యం వాసన

జనకుడి కూతురు ఋతుస్నానంచేయటానికి ఉదయాన్నే చెలికత్తెలతో కూడా నదికి వచ్చింది. (అంటే ఉద్దాలకుడు వస్త్రాన్ని వదలిన నదికి) ఆమె స్నానం చేస్తుంటే ఆమెకు మనోహరమైన పరిమళం వచ్చింది. ఆమె ఆశ్చర్యంతో ఈ వాసన ఏమిటా అని చుట్టూ కలయజూసింది. నీళ్ళల్లో కొట్టుకునివచ్చే వస్త్రం కనబడింది. ఆ వాసన వస్త్రంచే వస్తున్నదని గ్రహించి ఆమె ఆ వస్త్రాన్ని తీసుకొని తనివితీరా వాసనచూసింది అలా వాసన చూసుకొంటూ అంతఃపురానికి చేరింది. మరునాటి ఉదయాన్నే ఆమె ముఖంలో క్రొత్త మార్పు గోచరించింది. మరునాటి ఉదయం వాకా కూడా వస్త్రం అందంగాని, దాని సౌరభం గాని చెడనేలేదు. తరువాత కొన్నాళ్ళకు ఆమెకు నెలతప్పినట్లు తెలిసి తండ్రి ఆమెను అడవులకు పంపించాడు. ఆమె అక్కడ ఒక కుర్రవాణ్ని కని వానిని నీళ్ళలో వదలివేసింది. తిరిగి ఆ కుర్రవాడు ఉద్దాలకునికే దొరికాడు. ఆయన వాణ్ని పెంచిపెద్ద జేశాడు. తరువాత కొద్దికాలానికి ఆమె కుర్రవాణ్ని వెతుక్కుంటూ బయలుదేరి వాణ్ని సాధించి గుర్తించింది. ఉద్దాలకుడు తనకు కలలో కనపడిన అవస్థాలు ఈమెని గురించి స్వప్నం సంగతి వస్త్రం సంగతి చెప్పి ఆమెను భార్యగా స్వీకరించడంతో కథ ముగుస్తుంది. ముక్కుతో వాసన చూచినందున పుట్టినవాడు కనుక కుర్రవాడికి నాసికేతుడు అని పేరుపెట్టారట.

అయితే శుక్రాన్ని వాసనచూస్తే అది శోణితంలో ఎలా కలియగలదో, ఎలా గర్భోత్పత్తిని కలిగించుతుందో ఊహాతీతమే.

### పురుషగర్భాలు

5. మాంధాతృ చరిత్ర: ఈయన తండ్రి ఎడమభాగములోనుండి పుట్టినాడు. ఈని తండ్రి యువనాశ్వుడు. ఆయనకు ఎంతకాలానికీ సంతానం లేకపోగా ఆయన భృగువుదగ్గరకు వెళ్ళి తనకు సంతానాన్ని ఇవ్వమన్నాడు. భృగువు పుత్రకామేష్టి చేసి అందులో పుత్రుడు పుట్టడానికి పనికివచ్చునట్లుగా మంత్రజలంతో నిండివున్న కలశం సంపాదించాడు. ఆయన దాన్ని యజ్ఞంచేసి బ్రాహ్మణులకిచ్చి జాగ్రత్తగా కాపాడమన్నాడు. కాని ఒకరాత్రి వేళ యువనాశ్వునికి బాగా దాహం వేసింది ఆయన ఆ మంత్రజలాన్నే తాగాడు అయితే భృగువు తపోవీర్యంతో కూడుకున్న నీరు తాగగానే ఆయనకు గర్భంవచ్చింది ఆయన వందసంవత్సరాలు ఆ గర్భాన్ని మోసిన తరువాత ఆయన ఎడమభాగాన్ని ఛేదించుకొని మాంధాత పుట్టాడు మాంధాత పుట్టగానే యువనాశ్వునికి ఇంద్రుడు ప్రత్యక్షమై మాంధాత తన కుడిబొటన వేలు చీకిన అదే అమృతమయమవుతుంది అని చెప్పి వెళ్ళిపోయాడు. అయితే మాంధాత పుట్టుకలోని విశేషమేమంటే పురుషునికే గర్భం రావటం; ఇది అరణ్యపర్వంలోని కథ.

కన్నీటికొడుకు

6. వాలిసుగ్రీవుల తండ్రి ఋక్షరజసుడనేవాడు ఎలా పుట్టాడో చూదాము. ఇది ఉత్తరరామాయణంలోని కథ. యోగనిశ్చలతలోనున్న బ్రహ్మకన్నులనుండి కారిన నీటిని అరచేతిలోకిపట్టేడు ఆ నీటిలోనుండి ఋక్షరజసుడు పుట్టేడు. ఇది మన ఊహాకుకూడా అందనుగదూ!

తోకనుంచి కొడుకు

7. ఇప్పుడు వాలిసుగ్రీవుల జన్మవృత్తాంతం చూదాం. ఈ ఋక్షరజసుడొకనాడు అడవిలో తిరుగుతూ ఒక సరస్సు ఒడ్డుకు చేరుకున్నాడు ఆ సరసులో దిగి మంచినీరు తాగుతూ ఆయన తన ప్రతిబింబంచూచి వేరే ఇంకొకడు సరస్సులో ఉన్నాడు వాణ్ని చంపుతానని సరసులోకి దిగాడు. కాని పార్వతి శాపం కారణంగా అతడు స్త్రీగా మారిపోయాడు. అలా మారిన అతణ్ని ఇంద్రుడూ, సూర్యుడూచూచి మోహించారు. వారికి కలిగిన మోహం కారణంగా ఇంద్రుని తేజము (వీర్యము) ఆమె తలమీదపడింది. అదేసమయంలో సూర్యునికి కూడా ఇంద్రియస్ఖలనమై ఆమె గొంతులోపడింది. కాని తల మీద పడిన వీర్యముజారి, తోకమీదకువచ్చినిలిచింది. వాలము అనగా తోకకదా! ఆ తోకదగ్గరనుండి పుట్టినవాడే వాలి; సూర్యుని తేజం కారణంగా ఆమె గ్రీవం (మెడ) నుండి వచ్చిన

వాడు సుగ్రీవుడు. ఈ విధంగా వాలిసుగ్రీవులు జన్మించారు. తరువాత ఋక్షరజసుడు తిరిగి పురుషుడుగానే మారిపోయాడు.

ఈ విధంగా మామూలు సంగమంద్వారా కాక వివిధ పద్ధతుల్లో జన్మించినవారందర్ని గురించి (చాలామందినిగురించి) తెలుసుకున్నాంగదా. ఇంతేగాకుండా భాగవతంలో భారతంలో అనేక విధాలుగా జన్మించినవారెందరో వున్నారు. వీరిలో కొందరు కొంతమంది అప్సరసలకు పుట్టినవారే. మహర్షులు స్ఖలించిన వీర్యం కొందరు అప్సరసలు త్రాగటంద్వారా జన్మించినవారుకూడా ఉన్నారు. అంటే స్త్రీలుకూడా వీర్యాన్ని గాని,వీర్యంకలిపిన నీటినిగాని త్రాగినా గర్భంరావటం జరిగిందన్నమాట. అయితే ఇక్కడ మనం చెప్పుకొన్న వీళ్ళుగురు అందరకూ తెలిసిన సుప్రసిద్ధులు కనుక వారినిగురించే ముచ్చటించుకున్నాము.

## ముక్కకో కొడుకు

దుర్యోధనాదుల జన్మలుకూడా మన ఊహలకు అందేవి కావు. గాంధారి కుంతికి పిల్లలు కలగటంచూసి ఈర్ష్యతో గర్భాన్ని విచ్ఛిత్తి చేసుకొంది. వ్యాసుడు ఆ ముద్దను 101ముక్కలుగా చేయించి వాటిని నూటఒక్క బుంగల్లో పెట్టించాడు. ఆ బుంగల్లో నేయి పోయించి వాటిమీద నీళ్ళు పోస్తూంటే కొంతకాలంతర్వాత వాటిల్లోనుంచి క్రమంగా దుర్యోధనా

దులు వచ్చారు.

## వేలసంవత్సరాల కడుపు

సూర్యసారథియైన అనూరుడు ఎలా జన్మించాడో చూద్దాము. కశ్యపప్రజాపతికి ఇద్దరు భార్యలు. వినతఒకామె. రెండవభార్య కద్రువ. ఆయన వారిద్దరకు సంతానం ప్రసాదిం పదలచాడు. వారికి గర్భం వచ్చినది వారు వాటిని జాగ్రత్తగా అయిదువందలసంవత్సరాలు కాపాడారు అంటే ఈ గర్భాలు ఈనాటి గర్భాలవంటివి కావని గుర్తించాలి. వాటిని అండాలంటారు. వారి అండాలను నేతికుండల్లో ఉంచి కాపాడారు. తరువాత కద్రువ గర్భాండాలు పగిలి క్రమంగా వేయిమందిపుత్రులు కలిగారు, వినతకు బాధ కలిగి తన అండం పగులగొట్టింది. దానిలోనుంచి అనూరుడు వచ్చాడు. అనూరుడు అంటే ఊరువులు లేనివాడు అని అర్థం ఊరువులు అనగా తొడలు అతడు తన శరీరం పూర్తిగా వృద్ధిచెందకుండానే తాను చిన్న అండం పగులగొట్టిందని తల్లికి శాపమిచ్చాడు శాపకారణంగా ఆమె కద్రువకు దాసియైనది తరువాత 500 సంవత్సరాలకు గరుత్మంతుడు రెండవ అండం లో నుంచి జన్మించాడు ఇది వారి జన్మవృత్తాంతం దీన్నిబట్టి మన పురాణాలలోని పురుషులు, సంపర్కం అయినవెంటనే మొలకెత్తని (సద్యోగర్భం) వేల సంవత్సరాలవరకూ గర్భంలోనుంచి రావటం జరుగుతుంది.

అంటే గర్భధారణకాలం ఒకక్షణం మొదలు వేలసంవత్సరాలు.

పుట్టకుండానే గొడవ

ఇక గర్భంలో ఉండే పిండాలు చేసే అద్భుతకార్యాలు కొన్ని

ఉచథ్యమహర్షి భార్య మమత దీర్ఘతముణ్ని గర్భంలో ఉన్నది. ఆమెను బృహస్పతి కామించాడు అది అన్యాయమని గర్భస్థశిశువు ఆక్రోశించాడు. ఇదీ భారతంలోదే ఇలాగే ఇంకొక ఋషిపత్ని గర్భవతిగా నుండగా ఆమె మరది ఆమెను బలాత్కరిస్తాడు. గర్భంలో ఉన్న శిశువు ఆయన ఇంద్రియాన్ని బయటకు తన్ని వేశాడు.

అష్టావక్రుడు గర్భంలోఉండే తన తండ్రికి ఎదురు చెపుతాడు. తండ్రి శాపకారణంగా అష్టావక్రుడైనాడు.

భాగవతంలో గర్భస్థుడైన జీవుడు తనకు సద్గతులు కలిగింపమని దేవుని ఎంతగానో వేడుకోవడం కన్పిస్తుంది. ఇవన్నీ మనకు చాలా చిత్రంగా కనిపించే వ్యవహారాలు. ఈ విషయాలన్నీ మన ఊహకు అందేవి కావు. ఈ కథలను పోలినవే బైబిల్లోకూడా చాలా ఉన్నాయి. మాంధాతృ జన్మవంటిదే బైబిల్లోని ఈవ్ పుట్టుక కారణజన్మవంటిదే క్రీస్తుపుట్టుక ఇలాంటి పోలికలు ఎన్నెన్నో.

—మేరికపూడి సీతాపతిరావు యం. ఏ.

సీరియల్ నవల-

# సంస్కారం-8

భోజనాలయ్యాక బ్రాహ్మలంతా మఠంసావిట్లో చల్లని గచ్చుమీద కూర్చున్నారు వారిమధ్య గురువుగారొక్కరూ కుర్చీలో కూర్చున్నారు. ఎర్రరంగు బట్టలు కట్టుకుని, మెడలో రుద్రాక్షతావళాన్ని, నుదుట గంధంబొట్టూ పెట్టుకున్నారు. బూరిబుగ్గలతో, గుండ్రని బొమ్మలా కూర్చుని, కాళ్ళు పిసుక్కుంటూ, మర్యాదగా యోగక్షేమాలు వాకబుచేశారు. "ప్రాణేశాచార్య రాలేదేమి? ఆయన ఎలా ఉన్నారు? బాగున్నారా? మా ఆహ్వానం ఆయనదాకా వెళ్ళలేదంటారా?" అని అడిగారు.

గరుడాచారి గొంతు సవరించుకుని, జరిగిన కథంతా పూసగుచ్చినట్లు చెప్పాడు.

అంతా శ్రద్ధగావిని, గురువులు తమ నిర్ణయాన్ని ఇలా సెలవిచ్చారు- "వాడు బ్రాహ్మణత్వాన్ని విడిచిపెట్టినా, బ్రాహ్మణత్వం వాడినివిడిచిపెట్టలేదు. అంటే, నారాయణప్పకు

---

కన్నడమూలం :- శ్రీ యు. ఆర్. అనంతమూర్తి.

అనువాదం :- రాంషా

జరిగిన కథ

నారాయణప్ప 'బ్రాహ్మడైపుట్టి, చంద్రిని ఉంచు కుని మత్స్యమాంసాలుతిని చివరికి చచ్చిపోయాడు. బ్రాహ్మ ణత్వాన్ని అతను వదలినా అతన్ని బ్రాహ్మణత్వం వదల లేదు. దహనసంస్కారం ఎవరు చేయాలా అన్న ధర్మసందే హంవచ్చి, ప్రాణేశాచార్య ధర్మశాస్త్రాలు తిరగేశాడు. ఎక్కడా పరిష్కారం లభించలేదు. ప్రాణేశాచారి పురాణ కాలక్షేపాలే ఆ ఊరి కుర్రవాళ్ళని పాడుచేశాయని నారాయ ణప్ప అన్నాడు. నారాయణప్పే పాడుచేశాడని గ్రామస్థు లన్నారు. నారాయణప్ప శవదహనంకోసం చంద్రి తన నగ లిచ్చింది. బంగారం కళ్ళబడటంతో బ్రాహ్మల నోరూరింది వాళ్ళు పోటీపడటం ప్రారంభించారు. ప్రాణేశాచారి కది మరో సమస్య తెచ్చిపెట్టింది. మంచికోసం ఏది తలపెట్టినా చెడుఫలితాన్నిస్తుందని అదొకటి రుజువుచేసింది.

---

అంత్యక్రియలన్నీ యథావిధిగా పూర్తికావాలనికదా అర్థం! ఇక అపవిత్రతకూడా పోవాలంటే అతని ఆస్తియావత్తూ, వెండి బంగారాలతోసహా, ఈ మఠానికి, తద్వారా శ్రీకృష్ణపరమా త్మకు దఖలుపడవలసిందే! దీనికింత ఆలోచనా?" అంటూ గద్దించారు.

"మహాప్రభో! వాడికీ, మా నాన్నగారికీ మధ్య జరిగిన తగువులన్నీ తమకి తెలిసిందే! వాడి తోటలో మూడువందల పోకమొక్కలు నా వాటాలోకి రావాలని తమరు..." గరుడా

చాచి తడిగుడ్డతో ముఖం తుడుచుకుని ధైర్యంగా ప్రారంభించాడో లేదో 'అహా!' అంటూ లక్ష్మణాచారి అడ్డుపడ్డాడు.

"మహాప్రభూ! ఇందులో న్యాయం లేదా? నా రాయజప్ప పెళ్ళామూ, నా పెళ్ళామూ అప్పచెల్లెళ్ళని తమకు తెలిసి ఉండీకూడా..."

స్వామివారి గుండ్రని ముఖం చింతనిప్పుల్ని కురిసింది. ఏం దౌర్భాగ్యులయ్యామీరు? అనాథప్రేత ఆస్థియావత్తూ పరమేశ్వరాంకితమను సదాచారం తెలియదా? మరచిపోకండి, వాడి కర్మకు మేము అనుమతించకపోతే, మీరే ఆ ఊరువదిలి పోవలసివస్తుంది!" అంటూ గర్జించారు.

'మహాపరాధం, మహాపరాధం' అంటూ ఆ యిద్దరు బ్రాహ్మలూ చెంపలు వాయించుకుని స్వామివారి పాదాలపై పడ్డారు. వాళ్ళు లేచేసరికి, వారిలో గరుడాచారి కనబడకుండా పోయాడు. మఠం అరుగుమీద ఒళ్ళు తెలియని జ్వరంతో మూల్గటం చూశారు. ఆయనేం తినలేదు. అవతల శవం కుళ్ళిపోతోందన్న కంగారుకొద్దీ గరుడాచారిని అక్కడేవదిలి మిగిలిన బ్రాహ్మలంతా దూర్వాసపురం బయలుదేరారు.

భార్యకి సంస్కారంచేసిన తర్వాత ఆచార్యులుగారుతిరిగి ఇంటికి రాలేదు. ఆయనకి మరో ఆలోచనే రాలేదు. ఇంట్లో పెట్లో మూలుగుతున్న పదిహేను బంగారుజల్తారు శాలువలు గానీ, రెండువందలరూపాయలుగానీ, బంగారుతీగెలో కుట్టిన

రుద్రాక్షతావళంగాని అవసరమనిపించలేదు.

తన కాళ్ళు యెక్కడికి తీసికెడితే అక్కడికే పోవాలని నిశ్చయించుకుని తూర్పుదిక్కుగా బయలుదేరి వెళ్ళిపోయాడు.

## 51

అడవిలోకి సూర్యోదయం వెలుగునీడల మిశ్రమంగా ప్రవేశించింది. అలసటలో కాళ్ళీడ్చుకొంటూ ప్రాణేశాచార్య నడుస్తున్నారు. యెక్కడికి వెళ్ళాలో ఏ దిక్కుగా వెళ్ళాలో ఆయనకు ఒక అభిప్రాయమంటూ లేదు. తన భార్య శవం బాపతు కాలీకాలని ఎముకల్నీ, బూడిదనీ తీసుకుని నదిలో కలపకుండా ఇలా బయలుదేరి వచ్చేసినందుకు ఒక్కక్షణం విచారించాడు. 'నక్కలూ, కుక్కలూ వాటిని ముట్టుకున్నాయేమో!' అని బాధపడ్డాడు. తానిప్పుడు స్వేచ్ఛాజీవి; కర్మపరిత్యాగం చేసినమనిషి; తాను చేయవలసిన కర్మలుగానీ, తీర్చవలసిన ఋణాలుగానీ లేవు. వృధాపరితాపం అనవసరమనుకున్నాడు.

"నా కాళ్ళు యెక్కడికి తీసికెడితే అక్కడికి వెళ్ళాలనుకున్నాను. ఆ నిర్ణయాన్ని తప్పకూడదు!" అనుకున్నాడు. ఇదివరకు ఇలాగే మనస్సులో ఏదైనా ఆందోళన కలిగితే విష్ణు సహస్రనామాల్ని జపించేవాడు. అప్పుడుగాని మనస్సు స్థిరపడేదికాదు. అచ్యుతా, అనంతా, గోవిందా అంటూ మళ్ళీ

జపించాలనుకున్నాడు.

మానసిక చాంచల్యాన్ని సరిదిద్ది ప్రశాంతతను కలిగిం చేదే యోగం!

'వద్దు; ఏదీవద్దు భగవన్నామమూవద్దు; శ్లోకాలూవద్దు నా అంత నేను నిలబడాలి" అనుకున్నాడు. వెలుగుచీకట్ల రంగ వల్లిలాంటిది మనస్సు సూర్యకాంతి చెట్లకొమ్మల్లోంచి ప్రవ హిస్తూ ఈ రంగవల్లి నే సృష్టిస్తుంది. ఆకాశంలోని తేజస్సు చెట్లఆకుల్లోంచి జారి వెలుగునీడల్ని భూమిమీద సృష్టిస్తోంది; సుఖదుఃఖాలూ జననమరణాలు అలాంటివి. దానికితోడు ఏచిన్న వానజల్లుపడినా ఇంద్రధనస్సులు సప్తవర్ణాల్ని వెదజల్లుతాయి; మానవుని జీవితం తేజస్వంతంకావాలి. చైతన్యస్వరూపం అలాంటిది. ఆత్మసంతృప్తితో, ఆశ్చర్యంతో ఆకాశంలో ఎగిరే కృష్ణపక్షిలా జీవితం విస్తరించాలి. కాళ్లు నడుస్తాయి; కళ్లు చూస్తాయి; చెవులు వింటాయి— అయినా ఏ కోరికా లేకుండా ఉండటం! అప్పుడే జీవితం సంగ్రహిస్తుంది. కాకుంటే అది ఎండి పోయి, సడలిపోతుంది లేదా ఎక్కాలపుస్తకం అయిపోతుంది.

ఏ పాండిత్యమూ లేని యోగి వణకడు!- అయినా అతని మనస్సు ఒక చైతన్యస్రవంతి! ఏ పూర్వపుణ్యమో అది!— ఆయన తన గురువును సమీపించి- "ఎవరూ లేకుండా చూసి, మీరు నన్ను అరటిపండు తినమన్నారు!, ఎక్కడికెళ్ళమంటారు ఎక్కడ తినమంటారు? భగవంతుడు సర్వాంతర్యామి! నేనేం

చేయను?" అని అడిగాడు. నా జీవితంలో భగవంతుడికీ, ఎక్కాలకీ తేడా కనబడలేదు. రెండిటినీ ఒకేవిధంగా వల్లించాను. భగవంతుడు కణకుడికి చైతన్యంగా, అద్భుతంగా కనబడ్డాడు. నాకు యెక్కడున్నాడు దేవుడు?

ఒకసారి నువ్వు భగవంతుణ్ని విడిచిపెట్టావా, నీ పితృ ఋణమూ, దేవఋణమూ, గురుఋణమూ తీరిపోతాయి. మానవ సమాజానికే నువ్వు అతీతుడవుతావు. కనుకనే నీ కాళ్ళు ఎక్కడికి తీసికెడితే అక్కడికే పోవటం మంచిది. దారిలేని అడవిలో ఇలాగే నడు. అలసట, ఆకలి, దాహం— వీటిసంగతేమిటి? పాణేశాచార్య ఆలోచనాస్రవంతి అకస్మాత్తుగాఆగిపోయింది.

ఆత్మవంచనఅనే మరో గుహలోకి ప్రవేశించాడన్న మాట! బాగానేవుంది. కాళ్ళు తనని యెక్కడికి తీసికెడితే అక్కడికే వెళ్ళాలనికదా అనుకున్నాడు; ఆలమందల మెడగంటలు వినబడే తావుకు, గోపాలకుడి మురళీనాదం వినబడే తావుకు దగ్గరగా ఎందుకు నడుస్తున్నాడు? కనుక తన నిర్ణయం ఏదయినా, మానవుల ఉనికి సమీపంలోకే అతనికాళ్ళు తీసుకువెడుతున్నాయి. అతని స్వతంత్రానికీ, అతని ప్రపంచానికీ అదే సరిహద్దన్నమాట! మానవప్రపంచానికి దూరంగా బ్రతకలేడన్నమాట! కౌపీనసంరక్షణార్థం అయం పటాటోపః పాపం, అడవిలో ఒంటరిగా తపస్సు చేసుకునే ఋషిగారికి గోచీ వుంది. ఆ గోచీని ఎలకలు కొరికేస్తున్నాయి. ఆ ఎలకల్ని పట్టు

కోవటంకోసం పిల్లిని పెంచాడు. పిల్లికి పాలకోసం ఆవును పెంచాడు. ఆవుపాలను కాచటంకోసం ఆడదాన్ని తీసుకొచ్చాడు. ఆ ఆడదాని సుఖంకోసం పెళ్ళిచేసుకున్నాడు. తపస్సు చంకనాకిపోయింది విషయ వాసనలు అలాంటివి.

పనసచెట్టుక్రింద కూర్చున్నాడు ప్రాణేశాచార్య! అసలు విషయాన్ని నిశితంగా పరిశీలించటం మంచిది నా భవిష్యత్తును నిర్ణయించుకోవాలేగాని, ఇలా నన్ను నేను వంచించుకోకూడదు. నా భార్యకు సంస్కారంచేసినతర్వాత ఇలా ఎందుకు వచ్చేశాను? ఏం లేదు— అగ్రహారం కుళ్ళికంపుకొడుతోందిగదా అని, ఆ వాసనభరించలేక వచ్చేశాను. నువ్వు చెప్పిందీ బాగానే ఉంది. గ్రామం చెడిపోవటం, దుర్వాసన భరించలేకపోవటం సరియైన కారణాలే. కాదనను. అయితే, నా నిర్ణయంకోసం ఎదురుచూస్తున్న బ్రాహ్మణులున్నారుకదా, వాళ్ళని తప్పించుకోవాలని ఎందుకనుకున్నాను? ఎందుకని?"

ప్రాణేశాచార్య కాళ్ళు విడమర్చాడు: అలసట పోగొట్టుకోవాలని చూశాడు; మనస్సును కుదుటపరచుకోవాలనుకున్నాడు. ఆయన చూడకుండానే, ఆయన వెనకనే కోడెదూడ ఒకటి వచ్చి నిలబడింది. మోరయెత్తి ఆయన మెడను వాసన చూసింది గట్టిగా గాలి వదిలింది; తృళ్ళిపడి ప్రాణేశాచార్య వెనుదిరిగి చూశాడు. ఆ కోడెదూడ కళ్ళల్లో కారుణ్యం సుళ్లు తిరిగింది ప్రాణేశాచార్య చలించాడు. దాని గంగడోలును

వేళ్ళతో నిమిరాడు. అది మెడ పైకెత్తి, మరింత దగ్గరగా జరిగింది. దాని శరీరం గగుర్పొడిచింది. ఆయన చెవుల్నీ, బుగ్గల్నీ తన గరుకునాలుకతో నాకింది. దానితో ప్రాణేశాచార్య పులకరించిపోయాడు. లేచినిలబడి దానితో ఆడుకోవాలనుకున్నాడు. దాని మెడక్రింద చేతులు వేసి "ఉవ్వాప్వాప్వా" అన్నాడు ఆ కోడెదూడ తన రెండుకాళ్ళూ పైకెత్తి, అతని మీదకి దూకి, ఉరకలు వేసుకుంటూ వెలుగునీడలోకి పారిపోయింది.

ప్రాణేశాచార్య మళ్ళీ కూర్చుని యిందాకటి విషయం జ్ఞాపకం చేసుకోవటానికి ప్రయత్నించాడు. "అవును. అసలు ప్రశ్న. నేను మళ్ళీ ఆ బ్రాహ్మల్ని కలుసుకోవటానికి ఎందుకెళ్ళలేదా అనిగదా?" మనస్సు కుదుటపడలేదు. బాగా ఆకలి వేస్తోంది దగ్గరలో ఉన్న గ్రామానికి వెళ్ళి ఏదో కొంత తినాలి. లేచాడు. పేడకుప్పల్నీ, పశువుల అడుగుజాడల్నీ అనుసరించాడు. గంటసేపు నడిచేసరికి అమ్మవారిగుడి కనబడింది. అంటే అది బ్రాహ్మణ అగ్రహారం కాదన్నమాట! ఊరిపొలిమేర చెట్టు క్రింద కూర్చున్నాడు.

## 52

సూర్యుడు క్రమక్రమంగా ఆకాశం ఎక్కుతున్నాడు. నీడకూడా వేడెక్కుతోంది. దాహం వేస్తోంది. రైతెవడైనా

చూస్తే తప్పకుండా పళ్ళూ పాలూ తెస్తాడు. అనుకున్నట్టే ఎవరో రైతు చెరువులో గేదెల్ని కడుగుతున్నవాడల్లా అరచేతుల్ని దొప్పగా చేసుకుని ఈ బ్రాహ్మణ్ని చూశాడు. దగ్గరగావచ్చి నిలబడ్డాడు. తాంబూలం నవులుతున్నాడు పెద్దతలపాగా; మెలితిరిగిన మీసాలు, బహుశా గ్రామపెద్ద అయిఉంటాడని ప్రాణేశాచార్య గ్రహించాడు.

ముక్కూ ముఖమూ యెరగని వాడిని కలుసుకోవటం సుఖం. నోట్లో రసం తుళ్ళకుండా చుబుకం పైకెత్తి, చేతులతో సంజ్ఞ చేసి యెక్కడనుంచి వస్తున్నావని అడిగాడు. ఆ మనిషి ప్రాణేశాచార్య అని తెలిస్తే ఆ తలపాగామనిషి అంత ధైర్యముగా నిలబడతాడా? అంత నిర్లక్ష్యంగా అడుగుతాడా? నోట్లో తమ్మిరసం నింపుకుఉంటాడా? నీ గతాన్ని, నీ చరిత్రనీ నువ్వు వదులుకొంటే ఈ ప్రపంచసృష్టిలో నువ్వూ ఒక సామాన్య బ్రాహ్మడివే ఆ ఆలోచన రాగానే ఆయన మనస్సు పాడయింది. జవాబు రాకపోవటంతో ఆ రైతు పక్కకివెళ్ళి తాంబూలం ఉమ్మేశాడు; మీసాలకు అంటుకున్న రసాన్ని పైగుడ్డతో తుడుచుకున్నాడు. మళ్ళీ వినయంగా సమీపించి ప్రశ్నార్థకంగా ముఖం పెట్టి "అయ్యావారు యెందాకా వెడుతున్నారు?" అని నోరారా అడిగాడు.

ఆ పల్లీయుడు తనయందు కాస్త గౌరవం చూపించినందుకు ప్రాణేశాచార్య మనస్సు కాస్త కుదుటపడింది. "ఎక్కడి

కెడుతున్నావు?" అని బ్రాహ్మణ్ని అడక్కూడదని తెలుసన్న మాట! కాని, ప్రాణేశాచార్య సూటిగా జవాబు చెప్పలేక పోయాడు భగవంతుడి దయవల్ల ఆ ఆసామీ తనను గుర్తు పట్టలేనందుకు సంతోషించాడు.

చెమట తుడుచుకుని, చెయ్యి ఎటో చూపిస్తూ 'యిలా పోవాలి, అన్నాడు.

"అయ్యవారు లోయలోంచి వచ్చారా, లేక...?" అంటూ సమాధానంకోసం యెదురుచూశాడు. అబద్ధాలకు అలవాటుపడని ప్రాణేశాచారి నోరు "ఆఁ" అంది.

'ఆయువారంకోసం యెడుతున్నట్టున్నారు!'

ప్రాణేశాచారి తలదించుకున్నాడు. ఈ పల్లెటూరివాడి దృష్టిలో తానిప్పుడు ఆయువారపు బ్రాహ్మడిలా కనిపిస్తున్నట్టున్నాడు. ఇప్పుడాయన తేజస్సూ, ప్రభావమూ నశించిపోయాయి. కనుక ఆయువారపు బ్రాహ్మడిలా కనబడకతప్పదు. అవమానపు తొలిపాఠం ప్రారంభమయింది. 'వంచు, తలవంచు!' అనుకున్నాడు. జవాబుగా మరోసారి 'ఆఁ' అన్నాడు. పరాయివాడిదృష్టిలో తానెలాకనిపిస్తే అలా అయిపోవటంచూస్తే ఆయన స్వాతంత్ర్యపు హద్దులు పెరిగినట్లే అనిపించింది.

ఆ గ్రామపెద్ద లేచాడు. 'దగ్గరలో బాపనకొంపలేవీ లేవండి!'

"ఓ?" అన్నాడు ప్రాణేశాచారి నిర్లక్ష్యంగా.

"పదిపన్నెండు కోసుల్లో ఓ బాపనగ్రహారం ఉంది."

"అలానా?"

"బండిమీద యెడితే ఇంకా దూరమనుకోండి. కాలి నడకదారే కొంత దగ్గర!"

'మంచిది!'

'ఇక్కడ నుయ్యుంది. నేనో కుండ తెత్తా. నీళ్ళు తోడుకుని తానంచెయ్యండి. బియ్యం, కూరలూ తెత్తా. మూడు యిటుకలెత్తుకుని వండుకుతినండి. బాగా అలిసిపోయావు పేద బాపన్నడా! నిజంగా అగ్రారం పోదామనుకుంటే సెప్పండి; బాడోడు శేషప్ప సుట్టపునూపుకొచ్చాడు ఈ వూరు. అస లూరు అగ్రారమే బండి కాళీగాపోద్ది... ఆడు సెప్పిందాన్ని బట్టిసూత్తే మీకు అగ్రారం యెల్లాలని వుంటదో, లేదో! మూడురాత్రుల్నుంచి అక్కడో శవం కుల్లిపోతందంట! బాపనశవం! ఉష్... శేషప్ప అన్నాడు. పెద్దరేతిరి ఆ పెద్దమనిషిగోరి ముండ సేసప్పగోడి యింటికొచ్చి ఆ శవాన్ని కాలుత్తానికి సాయం సేయమందంట! ఆయనకు దగ్గరోడు యెవడూ లేడనుకుంటా సచ్చిన బాపనయ్య అలా కుల్లిపోవటం బాగుందా? సేసప్ప బండి కట్టుకువత్తుంటే, బాపనగ్గోరం కొంపలమీద రాంబంటములున్నాయంట!..."



చేతిలో ఇంత తంబాకు తీసుకుని నలుపుతూ కూర్చున్నాడు ఆ పల్లెపెద్ద.

చేతిలో ఇంత తంబాకు తీసుకుని నలుపుతూ కూర్చున్నాడు ఆ పల్లెపెద్ద.

శేషప్ప ఆ ఊళ్ళోనే ఉన్నాడన్న సంగతి విన్నాక పాణినేశాచార్యు గుండె ఒక్క క్షణం ఆగిపోయింది. తనస్థితిలో శేషప్ప చూడటం ఆయనకు ఇష్టం లేదు ఇంక అక్కడ ఎక్కువ సేపు ఉండటం కూడా మంచిది కాదు

"కొద్దిగా పాలూ, రెండు అరిటిపళ్ళూ ఇస్తే నేను వెళ్ళి పోతాను.' అన్నాడు ఆ ఆసామీ కేసిచూస్తూ.

'అదేమంత కష్టమండి! నిముషంలో తెత్తా. ఊళ్ళో బావనయ్య ఆకలితో ఉంటే అన్నం యెలా తింటాం బాబూ! అందుకే బిచ్యమిత్తానన్నా...!'

వెళ్ళిపోయాడు పాణిశాచారికి ముళ్ళమీద కూర్చు న్నట్లుంది. చుట్టూ చూశాడు; భయంతో కుంచించుకుపో యాడు. 'అన్నీ విడిచి పెట్టినవాడికి భయం మాత్రం ఎందుకు? అని ప్రశ్నించుకున్నాడు. అయినా భయాన్ని అణచుకోలేక ఆందోళనపడ్డాడు. ఆ పల్లెటూరి ఆసామీ గ్లాసుడు పాలూ, అరిటిపళ్ళఅత్తం పట్టుకొచ్చి ఆచార్యులముందు పెడుతూ "మంచిసమయంలో వచ్చారు బావనయ్యా! ముందేం జరు గుద్దో కూంత సెప్పండి. వొంజరూపాయలుపోసి, మా కుర్రాడికి ఓ పెళ్ళికూతుర్ని కొన్నా. అదింటికొచ్చి ఏదో దెయ్యంపట్టు కున్నట్టు, మూలగా కూకొంటోంది ఏదైనా కొంత మంత్రించి ఇస్తిరా...'

పాణిశాచారి మనస్సు అలవాటుకొద్దీ తన బ్రాహ్మణ త్వాన్ని నిలుపుకోవటానికి ఆరాటపడుతూంటే ఒక్కసారి కళ్ళెం వేశాడు. "నేను సమస్తాన్ని వదులుకుని వచ్చినా, యీ సమాజం నన్నింకా బ్రాహ్మణవిధుల్ని నిర్వర్తించమనే కోరుతోంది. ... ...నుంచి బయటపడటం అంత తేలిక

కాదు. దారినపోయేవాడిని దయతలచి పాలూపళ్ళూ పట్టుకొచ్చి యిచ్చిన ఈ పల్లెటూరిపెద్దకు యేంచెప్పను? పాపంచేసి, నాపవిత్రతను కోల్పోయానని చెప్పనా? నేను బ్రాహ్మణ్ణే కాదని చెప్పనా? లేక, నిజం చెప్పెయ్యనా?'

'ఇవాళ మంత్రించే స్థితిలో లేనయ్యా! నాకు చాలా దగ్గిర బంధువు చచ్చిపోవటం జరిగింది. ఇంకా నాకామైల వదల లేదు అన్నాడు. సమయోచితమైన జవాబు స్ఫురించినందుకు సంతోషించాడు. పాలుతాగి, గ్లాసు ఇచ్చేసి, అరటిపళ్ళు అత్తం అంగోస్త్రానికి కట్టుకుని, లేచి నిలబడ్డాడు.

'ఇట్టగిట పదికోసులుపోతే మెలిగే వస్తుంది. ఇయ్యాల, రేపూ, ఎల్లుండీ అక్కడ అరదోచ్చవం చేత్తారు. నేరుగా అక్కడికి పోతివా, ఇంత దండుకోవచ్చు." అంటూ చెప్పి, తాంబాకు నములుకుంటూ, గేదెల్ని తోలుకుంటూ ఆ కామందు వెళ్ళిపోయాడు.

ఆ కామందు కనుచూపుమేర దాటిపోగానే, మళ్ళీ కాలిదారిన అడివిలోకి ప్రవేశించాడు. తన సమస్య మరింత జటిలమయినందుకు ఆందోళనపడ్డాడు. 'నా జన్మలో యింత భయం యెరుగను! ఎక్కడ దొరికిపోతానో అన్న భయమే! ఇతరుల కళ్ళబడకుండా, రహస్యంగా బ్రతకలేనన్న భయం! నాకు మొదటినుంచీ ఉన్న నిశ్చింత పోయింది. ఏంచేత? ఎలాగ? భయంకొద్దీ మళ్ళీ అగ్రహారం వెళ్ళలేకపోతున్నాను. ఆ

బ్రాహ్మల చూపులముందు నిలబడలేనన్న భయం! అయ్యొయ్యో! వడిలో అబద్ధాన్ని కట్టుకుని యెలాగ బ్రతకటం?

# 54

అడివిలో నిశ్శబ్దం పెరుగుతున్నకొద్దీ ఆయన హృదయం తేలికయింది. కాళ్ళు మెల్లగా ఈడ్చుకొంటూ అరటిపళ్లు ఒలుచుకుతినటం ప్రారంభించాడు. ఆ గ్రామస్థుణ్ని కలుసుకున్నప్పట్నుంచీ అతని సమస్య మరీ యెక్కువయింది. దాని పిలక పట్టుకోవాలనీ, ముఖాముఖి ఎదుర్కోవాలనీ అనిపించింది నారాయణప్పతో పుట్టింది ఈ సమస్య నారాయణప్పని దహనంచేస్తేగాని వదిలేలాలేదు. అన్నిటికన్నా, ఏదోరోజున తగలవెయ్యక తప్పదు అయినా అయినా అది సమస్య అయికూర్చుంది. అది ధర్మశాస్త్రానికి సంబంధించిన సమస్య అయిపోవటంవల్లనే తాను ఆ పుస్తకాలన్నీ ముందు పడేసుకు కూర్చోవలసివచ్చింది. భగవంతుణ్ని శరణుజొచ్చవలసివచ్చింది చివరికి, ఆ అడవిలో, ఆ చీకట్లో...

ఆగిపోయాడు. విషయాన్ని సవ్యంగా, పరిపూర్ణంగా అవగాహన చేసుకోవటంకోసం గుండెను తట్టుకుంటూ, ఒక్క క్షణం ఆగాడు.

జరిగిపోయిన సంఘటనని పునశ్చరణ చేసుకోవాలనుకున్నప్పుడు, ఏదో స్వప్నవృత్తాంతాన్ని నెమరువేసుకున్నట్లుం

ుంది.

'నేను అనుకోకుండానే, ఆమె రొమ్ముల స్పర్శకు లోనయ్యాను. ఆమె చీరని మోటగట్టిన అరటిపళ్ళు తీసియిస్తే న్నాను. ఆకలి, అలసట, మారుతి యేం జవాబు చెప్పలేదన్న ాధ! అదే కారణం! నేనేమీ కోరకుండానే అలా జరిగిపోయింది! భగవదేచ్ఛ అలా ఉండబట్టే. ఆ క్షణం అలావచ్చింది ది పవిత్రమైన క్షణం! ఒక క్షణంముందు అలాలేదు; క్షణం తర్వాత అలాలేదు. ఇదివరకు యెన్నడూలేనిదానిని తృటిలో వెలిగించి, మరుక్షణంలో మాయంచేసింది అంతకుముందు దానికోరూపంలేదు ఆ రెండిటికీ మధ్యనే అది సాక్షాత్కరించి క్షణంసేపు వెలిగింది. కనుక, ఆమెను ప్రేమించటంలో నా బాధ్యత ఏమీలేదు. ఆ క్షణం అలా అవటానికికూడా నా బాధ్యతలేదు. అయితే ఆ క్షణమే నన్ను పూర్తిగా మార్చివేసిందేమి? మారిపోయిన మరో మనిషికి నేనిప్పుడు బాధ్యత వహిస్తునా?– ఈ ప్రస్తుత దుస్థితి కంతకీ నేనే కారణమా? ఆ అనుభవం ఇప్పుడు నా మనస్సులో లీలామాత్రంగానే వుంది కదా!— ఆ జ్ఞాపకం రేగిందంటే, మళ్ళీ నాలో కోరిక రేగుతుంది.

కోరిక రేగటంతో ఆచార్యులవారి శరీరం స్త్రీ స్పర్శకు ఒత్తిడిచేసింది. ఆయన కళ్ళు మత్తుతో అర్ధనిమీలితాలయ్యాయి.

55

చంద్రిని వెతుక్కుంటూ కుందాపురం పోదామా అను కున్నాడు. ఆత్మపరీక్ష చేసుకుంటూ ఆయన ఉపయోగించిన నిరాటంక తర్కమే ఆయనకు ఆటంకమయింది. కెరటాలువిరిగి పడ్డాయి.

'నిజంగా నేనామెను వెతుక్కుంటూవెళ్ళి, నేనామెను మళ్ళీ అనుభవించటమే జరిగితే, నా చేతకు నేనే జవాబుదారీ కానా? —కావచ్చు. అప్పుడయినా నా యీ ఆవేదన సమసి పోతుందేమో! అనుకోకుండా ఈ చైతన్యం నా జీవితంలోకి యెందుకు ప్రవేశించాలి? ఇదే నేను! ఇదిగో నూతన సత్యాన్ని సృష్టిస్తున్నాను! కొత్త వ్యక్తిని సృష్టిస్తున్నాను- ఈసారి భగ వంతుడి కళ్ళల్లోకి సూటిగా చూడగలను. ఇప్పుడు నా వ్యక్తి త్వానికి పాత ఆకారంలేదు. కొత్త ఆకారం ఇంకా సృష్టింప బడలేదు. తల్లికడుపులోఉన్న రాక్షసశిశువునుకోసి, బయటకు తీసినట్లుగా శైశవదశలోనే ఉంది నా వ్యక్తిత్వం!'

"ఆ అడివిలో, చీకట్లో, నానుంచి ఏ విధమైన ప్రయ త్నం లేకుండానే ఆ సంఘటన దానికదే అకస్మాత్తుగా జరిగిం దనికదా నా నమ్మకం! ఈ నమ్మకం యెంతవరకూ నిజమో నేనిప్పుడు నిర్భయంగా ఆలోచించాలి. నాఅంతటనేను దాని కోసం బయటకెళ్ళలేదు. కోరి తెచ్చుకోలేదు. అకస్మాత్తుగా

లభించినమాట నిజం! చేతులు చాచానేమో రొమ్ములు తగిలాయి— అప్పుడే కోరిక పుట్టింది— అదిగో, అదే రహస్యం అసలు రహస్యం అక్కడేవుంది. నువ్వు ఏ దారి తొక్కాలో నిర్ణయించే క్షణమే కదా అది? కాదు. తాను ఏ దారి తొక్కవలసింది నిర్ణయించుకోవలసిన క్షణం అది. అంటే, నా శరీరమే ఆ రకం స్పర్శకోసం ఎదురుచూస్తున్నట్లు అర్థంకాదు. కాదూ? అలాంటప్పుడు, అంత చీకట్లో చంద్రి తొడల్ని, పిరుదుల్ని వెతుక్కుంటూ నా చేతులు యెందుకు తడుముళ్ళాడాలి?— అలా ధర్మశాస్త్రాలను యెన్నడూ నేను తడమలేదే? ఆ క్షణములో, నా దారి ఎటో నిర్ణయించుకోవలసిన ఆ క్షణంలో!; చంద్రినే గ్రహించాలన్న నిర్ణయం జరిగిపోయినట్టేగదా!

'సరేనయ్యా. నేను నా స్వాధీనంలో లేకపోవటంవల్ల నే అలా అయిపోయాననుకుందాం. అయినా నిర్ణయించుకునే అధికారం నాకే ఉందిగా! మానవుడి నిర్ణయం డొల్లదనటానికి కారణం— దానిపై వాడికి ఆధిపత్యం నిలవలేకపోవడమే, అంతేగాని, ఆ నిర్ణయం అంత తేలికగా లభించలేదనికాదు. మన ఇష్టప్రకారమే మనం రూపొందుతాం. మన వ్యక్తిత్వాన్ని మన ఇష్టప్రకారమే నిర్మించుకుంటాం. నారాయణప్ప తన ఇష్టప్రకారమే తన వ్యక్తిత్వాన్ని నిర్ణయించుకున్నాడు. నేను మరోలా జీవించాలనుకున్నాను. ఆ ప్రకారమే జీవించాను. అకస్మాత్తుగా ఉండిఉండి ఒక చిన్న మలుపు తిరిగాను. అసలు

ఆ తిరగటంకూడా నేనే కావాలని తిరిగాననుకుంటే గాని నాకు సంతృప్తి లేదు. ఆ మలుపులో ఏం జరిగింది? రెండు వ్యక్తిత్వాలు ఢీకొన్నాయి; గొప్ప సంఘర్షణ పుట్టింది — నా జీవితంలోకి చొచ్చుకుపోయింది. నా వ్యక్తిత్వం ఇప్పుడు రెండు సత్యాలమధ్య త్రిశంకుడిలా వేలాడుతోంది.

"ప్రాచీనకాలపు **వాళ్ళు ఇలాంటి** అనుభవాలను ఎలా ఎదుర్కొన్నారు? ద్వంద్వం లేని సంఘర్షణల్ని? అదే ఆశ్చర్యం. మత్స్యగంధిని పడవలో గర్భం చేసి, వ్యాసుణ్ణి కన్న ఆ మహర్షి నాలాగే బాధపడుతూ వెళ్ళిపోయాడా? తన తపస్సంతా పోగొట్టుకున్న విశ్వామిత్రుడు స్త్రీవ్యామోహానికి లోనయినప్పుడు ఇలాగే పరితపించాడా? జీవితాన్ని త్యజించి భగవంతుని సన్నిధిలో జీవించే ఆ మహాపురుషులంతా ఈ సంఘర్షణల్నీ, వ్యతిరేకశక్తుల్నీ అధిగమించి జీవించి ఉండేవారా? ఈ పృథ్వి నిర్మించిన, నిత్యపరిణామశీలమైన రూపాలను పొందుతూ మహానది సముద్రంలో లీనమైనట్లే నిరాకారంగా జీవించలిగారా?

"ఏమో. నాకుమటుకు భగవంతుని అవసరం ఎక్కువగా కనిపిస్తోంది. నాకోసం కాకపోయినా, నా స్నేహితుడు మహాబలకోసమైనా కావాలి. నా చిన్ననాటి స్నేహితులందరికన్నా వాడికే భగవంతుడంటే గొప్ప భక్తి! ఇద్దరం కలిసే కాశీ వెళ్ళాం. మంచి తెలివైనవాడు; పొడగరి; అందగాడు; పచ్చని శరీరం. అతనిబుద్ధికుశలతకి అందనిదంటూ లేదు. గురువు



అతను గొంతెత్తి జయదేవుడి అష్టపదులు పాడుతూంటే నేను బృందావనంలోకి వెళ్ళిపోయేవాడిని.

గారు పాఠం చెప్పుతున్నప్పుడు ఆ తర్వాత అంశమేమిటో ఇట్టే గ్రహించేవాడు. వాడంటేనే తనకి ఎంతో అసూయ! ఎంతో ప్రేమ! నేను మధ్వుణ్ణి, వాడు స్మార్తుడూ అయినా మా ప్రగాఢమైత్రికి ఆటంకం రాలేదు. అద్వైతికి సహజంగా భగద్భావన వుండదు. అహం బ్రహ్మాస్మి అనికదా వాళ్ళ మతం. నేను మధ్వభావనతో భగవంతుని రూపకల్పన చేస్తున్న సమయంలోనే వాడికి భగవంతుడు సాక్షాత్కరించాడు.

(తరువాయి పై సంచికలో)

నీతిశాస్త్రం :

# వృత్త్యర్థా వతి ధావతః

చరకుడిలా అన్నాడు :

శరీరపోషకపదార్థాలలో అన్నమే శ్రేష్ఠమైనది. శ్రమను పోగొట్టి, ప్రాణానికి ఉపశమనాన్ని కలిగించేది నీరు. జీవాన్ని నిలిపి, రోగనిరోధకశక్తిని కలిగించేది పాలు. మాంసాహారం బలాన్ని కలిగిస్తుంది. ఉప్పు రుచిని కలిగిస్తుంది. దాహాన్ని అరికడుతుంది పుల్లనిపదార్థాలు మనస్సుకు ఉల్లాసాన్ని కలిగిస్తాయి. కోడిగుడ్లు బలవర్ధకమైన ఆహారం. తేనె శ్లేష్మాన్నీ, పైత్యాన్నీ పోగొడుతుంది. ఉప్పు ఎక్కువగా తినేవారికి వీర్యం తగ్గుతుంది.

పచ్చివెలక్కాయ కంఠస్వరాన్ని చెడగొడుతుంది. గొర్రెపాలనుండి తయారుచేసిన నెయ్యి తింటే రుచి చచ్చిపోతుంది.

మేకపాలు క్షయకు చక్కని ఔషధం. రక్తస్రావవ్యాధికి బాగా పనిచేస్తాయి. గొర్రెపాలు తాగితే శ్లేష్మమూ పైత్యమూ కలుగుతాయి.

గేదెపాలు తాగినవారికి నిద్రమత్తు ఎక్కువగా ఉంటుంది. తోడుకుంటూఉన్న పెరుగుతాగితే శ్లేష్మం ఎక్కువవుతుంది అడివికొర్రల అన్నంతింటే శరీరంఆర్చుకుపోతుంది. శరీరం స్థూలంగా ఉన్నవాళ్ళు ఈ అన్నంతినాలి. మాత్రం

ధారాళంగా తయారుకానివారు చెరకురసం తాగ్రటం మంచిది
యవలు మలాన్ని వృద్ధిచేస్తాయి. ఉలవలు ఆమపిత్తాన్ని,
మినుము శ్లేష్మపిత్తాన్ని కలిగిస్తాయి.

ఉసిరిపండు ముసలితనం రాకుండా నిరోధిస్తుంది. రక్త గ్రహిణికి మజ్జిగయే మంచి ఔషధం.

కేవలం మాంసంతినే జంతువుల మాంసమే గ్రహణికీ, క్షయకీ, మూలవ్యాధికీ మంచి ఔషధం.

ఆవుపాలు, ఆవునెయ్యి మేధస్సును వృద్ధిచేస్తాయి.

నెయ్యి, పెలపిండి సమంగా తింటే వీర్యం వృద్ధిఅవుతుంది.

నువ్వులనూనెను పుక్కిలించితే దంతాలు బలిష్టమవుతాయి; అన్నరుచికూడా కలుగుతుంది.

ఎక్కువగాతింటే పులితేన్పులొస్తాయి తక్కువగా తింటే ఆకలిచేస్తుంది. రోజూ వేళతప్పకుండా భోజనం చెయ్యాలి.

మలమూత్రాలను ఆపుకోకూడదు. దానివల్ల ఆరోగ్యమే చెడుతుంది.

కొద్దిగా మద్యం తీసుకుంటే మనస్సుకు ఉల్లాసంగా ఉంటుంది. మానసిక విచారాలుండవు.

భోజనం బరువైతే అజీర్ణం కలుగుతుంది; బాల్యంలో మూడుపూటలా తినాలి. ప్రౌఢవయస్సులో రెండుపూటలే

తినాలి. వయస్సు మళ్ళగానే ఒక్కపూటే భోజనం చెయ్యాలి. అసలు తినకుండా వుండటం ఆయుక్షీణం.

అకాలభోజనం, మరీ అల్పభోజనం వీటివల్ల శరీరం శుష్కిస్తుంది. చిరుతిళ్ళు తినటంవల్ల జీర్ణకోశం చెడుతుంది. ఆకలి మందగిస్తుంది.

ఒకేరసంగల భోజనం చెయ్యాకు. అది బలాన్ని క్షీణింప జేస్తుంది. అన్ని రసాలతో కూడిన భోజనమేచెయ్యి! అది బలాన్ని వృద్ధిచేస్తుంది.

భోజనానంతరం నూరడుగులన్నా నడవాలి. భోజనం చేసి కూర్చుంటే పొట్ట పెరిగిపోతుంది. పడుకుంటే కొవ్వు పెరుగు తుంది పరిగెత్తితే ఆయువు క్షీణిస్తుంది. కాస్సేపు అటూ ఇటూ తిరిగితే జీర్ణమవుతుంది.

భోజనసమయంలో నీ మనస్సును నిర్మలంగా ఉంచుకో ఈర్ష్య, భయం, లోభం, దైన్యం, ద్వేషంవంటి వాటిని నీ మనస్సులోకి రానివ్వాకు. అవి వస్తే నువ్వు తిన్న అన్నం జీర్ణం కాదు.

ఎప్పుడుచూసినా ఏదోఒకటి నములుతూఉండేవాళ్ళకి అజీర్ణంవస్తుంది. అజీర్ణమే అన్నిరోగాలకీ మూలం అని మరచిపోకు.

వెచ్చని అన్నాన్నితిను; చమురుతో తడిపిన అన్నాన్ని తిను మితంగాతిను. అంతకుముందు తిన్నది పూర్తిగా జీర్ణ

మయినతర్వాతనే తిను. మనస్సుకు ఆహ్లాదంగా ఉండేచోటనే తిను. త్వరత్వరగా మింగకు మరీ ఆలస్యంగా తినకు కబుర్లతో, ఆలోచనలతో అశ్రద్ధగా తినకు నవ్వుతూ తినకు, భోజనంమీదనే మనస్సుంచి మరీతిను. ఏకాగ్రతతో తిను. ఏ పదార్థమెంతెంత అవసరమో హితమో అంతవరకే తిను.— అలా తింటేనే నువ్వు నూరేళ్ళూ జీవిస్తావు ఇదే పథ్యం.

రోగాన్ని కలిగించని ఆహారమే పథ్యం. రోగాన్ని గ్రహించినవాడే వైద్యుడు.

ఒకే శాస్త్రాన్ని చదివినవాడు శాస్త్రార్థనిశ్చయాన్ని చెయ్యలేడు. అనేకశాస్త్రాలు చదివినవాడే వేదుడు.

వేదుడుకాని వైద్యుడు ప్రాణాన్ని, ధనాన్ని హరిస్తాడు.

పథ్యంచేసినవాడికి రోగమేరాదు; కనుక ఔషధం అవసరంలేదు పథ్యం చెయ్యనివాడికి రోగంపోదు; కనుక వాడికీ ఔషధం అవసరంలేదు.

శూన్యగృహంలో ఒంటరిగా నిద్రపోకు: గాఢనిద్రలో వున్నవాడిని లేపకు. రజస్వలఅయిన భార్యతో కలియకు. పిలకపోయినా పండితసభలకు వెళ్ళటం మానకు.

అగ్నిని నోటితో ఊదకు. దిగంబరిగా ఉన్న పరస్త్రీని చూడకు. నిప్పులమీద అరికాళ్ళను కాచుకోకు.

ఉదయిస్తున్న సూర్యుని, అస్తమిస్తున్న సూర్యుని, నీళ్ళల్లో ప్రతిబింబించే సూర్యుని, నడినెత్తిమీద ఉన్న సూర్యుని

తేరిపారిచూడకు.

ఉదయపు ఎండలో కూర్చోకు; వల్లకాటి పొగను పీల్చకు మరీ వృద్ధురాలైన స్త్రీతో సంగమించకు; పడియలోని నీళ్ళు తాగకు. రాత్రిలందు పెరుగు భోజనం చెయ్యకు. వర్షంలో పరిగెట్టకు పశువుల్ని కట్టిన తాళ్ళని దాటకు. నీళ్ళల్లో నీ ప్రతిబింబాన్ని చూసుకోకు

ధార్మికులు లేని గ్రామంలో ఉండకు; రోగాలతో నిండిన గ్రామంలో ఉండకు; ఒంటరిగా ఏ దారినీ ప్రయాణం చెయ్యకు పర్వతాల మీద చిరకాలం వశించకు.

ఒకరు విడిచిన చెప్పుల్నీ, బట్టల్నీ, పువ్వుల్నీ నగల్నీ ధరించకు; ఒకరు తిన్న పాత్రల్లో భుజించకు.

పగిలిన పీటపై కూర్చోకు; గోళ్ళు కొరుక్కోకు; వెంట్రుకలు పీకకు; పెద్దకథలు చెప్పకు; విడిచిన పూలమాలల్ని ధరించకు. ఎడ్లమూపులపై ప్రయాణించకు.

మట్టికలిపేవాడు, గడ్డిపరకలు తుంచేవాడు, గోళ్ళు కొరుక్కునేవాడు, శుచీశుభ్రతా లేనివాడు, చాడీలు చెప్పేవాడు తొందరలోనే నశిస్తారు.

ఊళ్ళకీ, ఇళ్ళకీ ఆవరణలుంటాయి. కంచెలూ, గోడలూ దాటకు. మారుత్రోవలు పట్టకు. రాత్రిలందు చెట్లక్రింద నివసించకు.

ఇంటికి దూరంగా మూత్రాన్ని విసర్జించు; దూరంగానే కాళ్ళు కడుక్కో; దూరంగానే ఎంగిళ్ళు పారెయ్యి.

సాయంత్రపుయెండ, హోమంచేసినపొగ, ప్రౌఢస్త్రీతో సంగమం, నిర్మలమైన నీళ్లు, రాత్రిళ్లు క్షీరాన్నం తినటం— ఆయుర్వృద్ధికి అవసరం.

మంచినీళ్ళల్లో ఉమ్మకు; మలమూత్రాలను వదలకు; అశుద్ధవస్తువుల్నీ, విషాన్నీ, రక్తాన్నీ కలపకు.

---



---

# కుక్క జన్మ

మర్నాడు ప్రభావతి యధావిధిగా తన ప్రియుడికోసం బయలుదేరి చిలుక అనుమతిని అర్థించింది. చిలుక నవ్వి "ఓ అందాలభామా! కష్టాలు కొనితెచ్చుకునే కొంటెపని చేసేటప్పుడు యశోదేవిలా తెలివైన కథల్ని చెప్పగల చాకచక్యం ఉంటే ధైర్యంగా వెళ్ళి, సుఖపడిరా!" అన్నది.

"ఓ చిలుకతల్లీ! ఎవరమ్మా ఆ యశోదేవి? ఏ సందర్భంలో తన చాకచక్యాన్ని ఏ విధంగా చూపించింది?" అని పద్మావతి అడిగింది

'వద్దులే, ప్రభావతీ, ఆ కథలన్నీ ఇప్పుడు వద్దు. నేనూ నా కథా పుచ్చుకుని, నీకూ నీ ప్రియుడితో సరసాలకీ మధ్య అడ్డంగావస్తే, ఆ తర్వాత నీకు నామీద చాలా కోపంవస్తుంది. ఆ పనేదో ముందే అయిపోనీ- ఆ తర్వాతనే ఆ కథ చెప్తాను" అన్నది చిలక.

'పెద్దవాళ్ళ సుద్దులెలాంటివైనా, వాటిని గౌరవంగా వినాలి. వాళ్ళ అనుభవం మనకి రావద్దా? ముందు ఆ కథ చెప్పు!" అని ప్రభావతి పదేపదే బ్రతిమాలగా చివరికి చిలక చెప్పటం ప్రారంభించింది.

అనగనగా నందనమనే ఒక ఊరుఉంది. ఆ ఊరికి ఓ రాజుగారున్నారు. ఆయనపేరు నందనుడు. ఆయనకో కొడుకు

ఉన్నాడు. ఆ కొడుకుపేరు రాజశేఖరుడు. ఆ రాజశేఖరుడి భార్యపేరు శశిప్రభ! అందానికి ఆ చంద్రుడెంతో శశిప్రభ కూడా అంతే. చంద్రుడికైనా మచ్చఉందిగాని, శశిప్రభకు లేదు.

ఆ ఊళ్ళోనే ధనసేనుడనే ఆయన కొడుకు వీరుడున్నాడు అతగాడు శశిప్రభ అందాన్ని చూసి, మోహించి ఎలాగైనా ఆమెతో పొందుకూడాలని పరితపించిపోతున్నాడు. ఎంత సొమ్మయినా ఖర్చుపెట్టటానికి సిద్ధంగాఉన్నాడు. సొమ్మయితే ఖర్చుపెడతాడుగాని పరాయివాడిభార్యను పొందటం తేలికా? ఆ అమ్మాయికికూడా అతనిపై మనసువుండద్దా?

అందని మాృనిపండుగదాఅని నిరాశచేసుకున్నాడు. తన మనస్సులోనే కుమిలిపోతూ అన్నం ముట్టటం మానివేశాడు. చిక్కిశల్యమవుతున్నాడు ఏనుగులాంటి కొడుకు తన కళ్ళ ముందే పీనుగులా మారిపోవటంచూసి, అతనితల్లి, కొడుకు విచారానికి కారణమేమిటాఅని అడిగింది. కళ్ళనీళ్లు పెట్టుకుని ఏడ్చింది. తల్లి ఆవేదన గ్రహించి మన వీరుడు తల్లితో నిజం చెప్పేశాడు. శశిప్రభను అనుభవించకపోతే బ్రతకలేనన్నాడు

తల్లి నిర్ఘాంతపోయింది. కొంతసేపటికి తేరుకొని 'పిచ్చి నాయనా! ఆ రాకుమారిని తీసుకురావటం నా తరంకాదురా!' అని వాపోయింది కొండమీద కోతినైనా తేవచ్చుగాని కోట

లోని యువరాజుగారి అందాలభార్యను ఎలా తేగలరు?— ప్రేమ తెగిపోవా?

తన కోరికను తల్లి కూడా తీర్చలేదని తెలిసిన తర్వాత విరహంతో కృశించిపోయి వీరుడు మరణానికి చేరువయ్యాడు. ప్రేమ, ప్రేమ అంటూ మురిసిపోతామేగాని ఆ ప్రేమయే ప్రాణాల్ని తీస్తుంది. ప్రేమించి చచ్చిపోయినవాళ్ళు ఎంతమంది లేరు?

కొడుకు చావుబ్రతుకులమీద ఉండటం ఏ తల్లి సహించగలదు? అయినా ఏం చెయ్యగలదు? నువ్వయితే ఏంచేస్తావ్ ప్రభావతీ?"

'నేనా? నేనే ఆ వీరుడి తల్లినయితే ఆత్మహత్య చేసుకుంటాను," అంది ప్రభావతి.

'ఇదిగో, ఇక్కడే తెలివితేటలుకావాలి. ఆ వీరుడితల్లి యశోదేవి నీలాంటి తెలివితక్కువదికాదనుకో! అందుకే ఆమెకంత యశస్సు! మంచి ఆడకుక్కనొకదాన్ని సంపాదించి, పాలూమీగడా వేసి పెంచింది. మరో మొగకుక్క వాసన కూడా దానికి సోకకుండా కాపాడింది.

ఒకరోజున చీనిచీనాంబరాలూ కట్టుకుని, ఆ కుక్కని వెంటబెట్టుకుని తిన్నగా కోటలో శశిప్రభ ఇంటికెళ్ళింది యశోదేవి. ఏదో ప్రసంగంలో ఆ కుక్క సంగతి ఎత్తి—

"శశిప్రభమ్మా! నువ్వూ, నేనూ, యీ కుక్కా పూర్వ

జన్మలో అక్కచెల్లెళ్ళం. ఒకే యింట్లో పెరిగేవాళ్ళం. నాదగ్గర కొచ్చిన ఏ మగకుక్కనయినా కాదనకుండా, ఎంతో సౌదార్యంతో నేను ఆనందపెట్టి, నేనూ ఆనందించేదాన్ని. నువ్వలా గాదు ఏదో మనస్సులో బాధపడుతూ తప్పనిసరిఅయినప్పుడే ఒప్పుకునేదానివి. ఈ కుక్క సుతలామూ ఏ మగకుక్కనీ దగ్గరికి రానిచ్చేదికాదు. కనుక ఇది ఇంకా పూర్వజన్మ వాసనలతో నేవుంది. నేటికీ ఇది ఇంకో మగకుక్కని రానివ్వటంలేదు పై జన్మలోకూడా ఇది కుక్కయిపుడుతుంది. నువ్వు ఇహాపట్టాన ఒప్పుకునేదానివికాదు కాబట్టి నీకు పూర్వజన్మ లేకుండాపోయింది. ఆ అనుభవానందంకూడా నీకు మిగలలేదు. నేను యెంతో చనువిచ్చి, నాతో నా ప్రియుల్ని గడపనిచ్చాను కనుకనే నాకిప్పటికీ గతజన్మలోని అనుభవానంద జ్ఞాపకంఉంది ఓ శశిప్రభా! ఈ కుక్కనీ నిన్నూ చూశాక, ఇంత అందగత్తెగా పుట్టి, మళ్ళీ కుక్కజన్మ యెత్తుతావన్న జాలివేసి, ఈ నిజం నీ చెవిని వేసిపోదామని వచ్చా. చేసుకున్నమ్మకి చేసుకున్నంత అని అంటారు. కొందరు ధనాన్ని యాచిస్తారు. కొందరు శీలాన్ని యాచిస్తారు; ఎవరేమిఅడిగినా కాదనకుండా ఈజన్మలో యిచ్చుకుంటావో ఉత్తరజన్మలో సమస్త ఐశ్వర్యాలనీ పొందుతావు. పెట్టిపుట్టటమంటే ఇదేకదమ్మా!

మరో రహస్యం చెపుతావిను! ఇంటింటికీ వెళ్ళి అడుక్కుతినేవాళ్ళున్నారు! నిజంగా వాళ్ళు యాచకులుకారు. సంప

న్నలకి వాళ్ళు జ్ఞానాన్ని పంచిపెట్టే ధర్మదేవతలనుకో। 'ఇది గో, ముష్టివెయ్యనివాళ్ళు యెవరైనా మాలాగే ముష్టివాళ్ళవు తారని వాళ్లు లోకానికి చాటిచెప్తున్నారనుకో! ఈ జన్మలో యెవరు ముష్టి వెయ్యరో వాళ్ళుఉత్తరజన్మలో ముష్టివాళ్ళయి ఇంటింటికీ అడుక్కుంటూ తిరుగుతారు. అలాగే ఈ జన్మలో తన అందాన్ని నలుగురికీ పంచిపెట్టనివాళ్ళుకూడా పై జన్మలో కుష్టువాళ్ళయి పుడతారమ్మా!' అని చెప్పింది.

ఈ దారుణమైన శాపమానం వినేసరికి, శశిప్రభ హృదయం కళవళపడి, కన్నీళ్లుకురవటం ప్రారంభించాయి. యశోదేవిని కౌగలించుకుని 'అక్కా, నన్ను కాపాడవా? నా అందాన్ని మరెవరికైనా దానంచేసే అవకాశాన్ని నాకు చూసిపెట్టవా?" అంటూ అర్థించింది.

పాపం శశిప్రభ దుఃఖాన్ని చూడలేక, ఆమె కోరికని కాదనలేక, శశిప్రభ భర్త అయిన రాజశేఖరుతో చెప్పి, ఆమెను తన ఇంటికి తీసికెళ్ళి, తన కొడుక్కి అప్పగించి పుణ్యంకట్టుకుంది రాజశేఖరుడికి యెన్నో బహుమానాలిచ్చింది దానితో ఆయనకూడా సంతోషపడి, ఆమెతో తన పెళ్ళాన్ని పంపటానికి యెన్నడూ అభ్యంతరం చెప్పేవాడుకాదు.

ఈ విధంగా యశోదేవి రాజశేఖరుడిని మోహింపించి తన కొడుకు ప్రాణాలు కాపాడింది. ఈ ప్రభకు మళ్ళీ వేరే కుక్క జన్మరాకుండా పుణ్యం కట్టుకొంది.

ఓ సుందరాంగీ! ప్రభావతీ! యశోదేవిలాంటి తెలివి తేటలు నీకూ ఉంటే తప్పకుండా నువ్వూ వెళ్ళి సుఖపడు! లేకుంటే నలుగురిలోనూ నగుబాట్ల పాలవుతావు.'

చిలక చెప్పిన కథ విన్నాక, ప్రభావతి ఆ కుక్క జన్మ సంగతి ఆలోచిస్తూ అలాగే నిద్రపోయింది

---

ఇంటర్వ్యూ-

# లైంగిక సమస్యలు

పరిమిలాల సుధాకర్‌లు మళ్ళీ మా కార్యాలయానికి వచ్చి కూర్చున్నారు. వివాహానికి యుక్తవయస్సు గురించీ, వివాహ యోగ్యతలగురించీ మామధ్య చర్చలు జరిగాయి.

పరిమిల: వివాహానికి యుక్తవయస్సు అంటూ చెపుతారుకదా! అదేదో చెప్పండి?

జవాబు- పరిస్థితులనుబట్టీ, వ్యక్తుల్నిబట్టీ వివాహానికి యుక్తవయస్సును నిర్ణయించవలసిఉంటుందమ్మా! సమాజంలో ఉన్న ఆడపిల్లల్ని చూడండి- కొందరాడపిల్లలు పదమూడేళ్ళు, ఆలోపూఉంటారు. బాగా ఎదిగిన శరీరం, పెరిగిన రొమ్ములూకుండి పరిపూర్ణ ఆరోగ్యంతో కనిపిస్తారు. మరికొంతమంది అమ్మాయిలు ఇరవై యేళ్ళు నిండినా సన్నగా రివటలా, ఏపాటి యవ్వనఛాయలూ కనబడకుండా, బల్లపరుపు ఛాతీతో ఈజురోమంటూ కనిపిస్తారు. ఈ ఇద్దరిలోనూ ముందు చెప్పిన రకం అమ్మాయిలు పెళ్ళిచేసుకోవచ్చు. రెండవరకం అమ్మాయిలు అంత చిన్నవయస్సులో పెళ్ళిచేసుకోకూడదు. మగపిల్లల విషయం వేరు. వాళ్ళల్లో ఈ తేడా ఇంత స్పష్టంగా కనిపించదు. కనుక పద్దెనిమిదేళ్ళు వయస్సు వచ్చేసరికి సమర్థవంతంగా రతిని నిర్వహించగలరు. సంతానాన్ని కనగలరు.

పరిమిల: దీనినిబట్టి ఆడపిల్లకు శరీరపరిపక్వత యెప్పుడొస్తే అప్పుడే

పెళ్ళిచెయ్యాలిగాని, ఫలానా వయసులో పెళ్ళి చేయాలనుకోవటం కరెక్టు కాదనిపిస్తోంది. అవునా?

జవాబు- వివాహానికి ప్రధాన ప్రయోజనం సంతానాన్ని కనటం. అంటే స్త్రీకి మాతృత్వమన్నమాట! ఆడపిల్ల పెద్దమనిషి అయినప్పటినుంచీ దాంపత్యంలోకి ప్రవేశించినా వచ్చే నష్టమేదీలేదు. పైగా అది ఆమె ఆరోగ్యానికి చాలా మంచిది. కాని, ఇరవై, ఇరవై యొక్క ఏళ్ళనాడు దాటకుండా ఆమె "తల్లి" కాకూడదు. అలా తల్లి కావటం ఆ తల్లికీ, బిడ్డకీ కూడా మంచిదికాదు. అందుకే ఆడపిల్లకు ఇరవై యొక్క ఏళ్లు వచ్చేదాకా తొలిసారి గర్భవతి కాకూడదని మేము భావిస్తున్నాము. పెళ్ళయినతర్వాత పిల్లలు కలగటం సామాన్యంగనుక కనీసం ఆడపిల్లకు పద్దెనిమిదవఏడయినా నిండితేగాని పెళ్ళిచేయకూడదంటున్నాము.

ప్రమీల: ఒక అమ్మాయి 12వ ఏటనే పెద్దమనిషి అయిందనుకోండి. ఆ అమ్మాయి పెళ్ళి చేసుకుని అప్పటినుంచీ సంసారం చేసినా తప్పులేదు. మొటొచ్చి తొలిగర్భధారణని ఇరవైయొకటవఏటిదాకా వాయిదావేస్తేచాలు నంటారు. అలాంటప్పుడు బాల్య వివాహాలకు మీ అభ్యంతరం ఏమిటి?

జ. బాల్యమంటే పదమూడేళ్ళ లోపు వయస్సని. పద్దెనిమిదేళ్ళదాకా కౌమారం అంటారు. కౌమార వివాహాలకు మా అభ్యంతరంలేదు. బాల్యవివాహాలు బొత్తిగా బొమ్మలపెళ్ళిళ్ళే గనుకనూ, సంధానానికి నిషిద్ధంగనుకనూ మేము అంగీకరించం పదెనిమిదేళ్ళవారు యువతీయువకులనుకుంటే కౌమారంలో పెళ్ళి

చేసుకుని రతిని నిర్వహిస్తూనే సంతానధారణను యువ్వనానికి వాయిదా వేసుకోగలిగితే మాకు అభ్యంతరం లేదు. అందుకను వుగా కుటుంబనియంత్రణ పద్ధతులు చాలా మంచి వున్నాయి.

ప్ర. అతని సంగతేమిటి?

జ. మగవాడికి "మాతృత్వ" సమస్య లేదు. కాని, అతనికి శారీరిక, మానసిక పరిపక్వత లభించాలిగదా! అతని ఆరోగ్యమూ, ఆర్థికపరిస్థితులూ బాగుండాలి. అందుకే ఇరవై యేళ్ళు అయినా నిండాలని అనుకుంటున్నాము. ఏమయినా పాతికేళ్ళు దాటకూడదు.

సుధాకర్ — మీ ఛాదస్తంగాని, గర్భనిరోధక సాధనాలు వచ్చినతరువాత పదమూడేళ్ళ అమ్మాయి, పదహారేళ్ళ అబ్బాయీ పెళ్ళాడితేమాత్రం వచ్చిన నష్టమేమిటి? ఆర్థికపరిస్థితులంటారా?— అవి పాతికేళ్ళు నిండినా పరిష్కరింపబడతాయని నమ్మకంలేదు. ముప్ఫయేళ్ళు వచ్చినా ఇంకా నిరుద్యోగులుగా ఉన్నవాళ్ళు చాలామంది ఉన్నారు. ఏమంటారు?

జ. నేను మానసిక పరిపక్వత అవసరంగురించి మీకు ముందే చెప్పాను. పారిశ్రామిక విప్లవం పొందిన అమెరికాలో ఈ విషయమై కొంత పరిశోధన జరిగింది. ఇరవై ఏళ్ళలోపు వయసులో పెళ్ళిచేసుకున్న ఆడపిల్లలు, ఆ పై వయసులో పెళ్ళి చేసుకున్న ఆడపిల్లలకన్నా అయిదురెట్లు యెక్కువగా విడాకులు తీసుకోవటం జరిగింది. కేథరిన్ బి. డేవిస్ అనే అమెరికన్ మహిళ భార్యాభర్తలిద్దరూ ఇరవై యొక్క ఏళ్ళలోపుగా వివాహం చేసుకున్నవాళ్ళయితే, అంతకుమించిన వయస్సుగల

వధూవరులకన్నా ఏడురెట్లు యెక్కువగా విడాకులు తీసుకున్నారని నిర్ణయించింది. ఆమె మొత్తం వెయ్యి దాంపత్యాలను పరిశీలించింది.

ప్ర. ఎంచేతనంటారు?

జ. కుర్రవాళ్ళకు అనుభవంతక్కువ; ఆవేశం ఎక్కువ. వాళ్ళకి జీవితవాస్తవాలు తెలియవు. ఊహాస్వప్నాల్లో విహరిస్తూవుంటారు. అందుకే వాళ్ళకి సరియైన పాత్రత; ఖేరక్టర్ యేర్పడలేదని చెప్పవచ్చు.

ప్ర. మనదేశం పరిస్థితులు వేరుకదండీ! మనదేశంలో ఆడపిల్లలు మగపిల్లలకన్నా చిన్నవయసులోనే మానసిక పరిపక్వతను పొందుతున్నారు. అదీగాక పిల్లలపెళ్ళిళ్ళు ఈ దేశంలో స్వయంవరాలుకావు. పెద్దలే తమ పిల్లలకు తమ అనుభవాన్ని పురస్కరించుకుని తగిన సంబంధాలు చూడటం జరుగుతోంది. ఏమంటారు?

జ. అవుననుకోండి. విదేశాలలోలేని సౌకర్యం మనదేశంలోఉంది. పిల్లల పెళ్ళిళ్లను ఈ దేశంలో పెద్దలే ఏర్పాటుచేస్తున్నారు. కాని, ఒక్కొక్కప్పుడు ఈ పెళ్ళిళ్లను నిర్ణయించేటప్పుడు పెద్దవాళ్లు తమ సాంఘికహోదాలకు, ఆర్థికస్థితిగతులకూ ప్రాధాన్యతను మితిమించి ఇవ్వటంజరుగుతుంది. తద్వారా వారి నిర్ణయాలు— ముఖ్యంగా ఆడపిల్లలకి— ప్రాణసంకటంగా పరిణమించిన ఘట్టాలు, ఉదంతాలూకూడా కనిపిస్తున్నాయి. కొత్తకోడళ్ల ఆత్మహత్యలకు ఇవి కారణం కాదంటారా?

ప్ర. అదీ నిజమేనండి. కాని, మన దేశంలో పెద్దవయసులో పెళ్ళిచేసుకున్న దంపతులకన్నా, చిన్నవయసులో పెళ్ళిచేసుకున్న దాంపత్యాలే ఎక్కువ స్థిరంగా ఉన్నట్లు కనబడుతోంది. అదికూడా గమనించారా?

జ. అవును. దానికి ప్రధాన అవరోధం పెద్దవయసు వధూవరులలో పెరిగిన వ్యక్తిత్వాలేనని మా అభిప్రాయం. కొన్ని వేల సంవత్సరాలుగా భార్యాభర్తలమధ్య సంబంధం బానిసకీ యజమానికీ మధ్య ఉన్న సంబంధంగానే ఉండిపోయింది. పెళ్ళాంపై భర్త అధికారంచేయటం, పెళ్ళాన్నిపట్టుకు కొట్టటం వంటి వాటిని సమాజం అంగీకరించింది. స్త్రీకి వ్యక్తిత్వం లేదుగనుకనూ, విడాకులహక్కు ఆ రోజుల్లో లేదుగనుకనూ, మొగుడు విడిచిన 'ముండ'ని సమాజం నీచంగా పరిగణించేది గనుకనూ అనాటి దాంపత్యాల్లో స్త్రీలు చచ్చినట్టు పడున్నారు కాని, ఈనాడు స్త్రీవిద్య, స్త్రీ స్వాతంత్రం, స్త్రీల ఆస్తిహక్కు, ఉద్యోగపుహక్కూ గుర్తించబడ్డాయి. యివన్నీ ఆమెకు వ్యక్తిత్వాన్నిస్తున్నాయి. కనుక మారిన సంస్కృతిలో మారని కాలపు దాంపత్యధర్మాలు నిలబడవు. స్త్రీల పునర్వివాహం అనుమతించటంతో పాతకాలపు పాతివ్రత్యానికి ఉద్వాసన జరిగింది. ఆనాటి స్త్రీ పురుషుని భోజ్యవస్తువుగా పడివుంటే ఈనాటిస్త్రీ పురుషుని నుంచి సంభోగసుఖాన్ని ఆశిస్తోంది. యీ విధంగా ఈనాటి వివాహాలు ఇద్దరు సమస్థాయి వ్యక్తులమధ్య గౌరవప్రదమైన సంబంధాలుగా తయారయ్యాయి చూడు

తున్న కాలాన్ని మీరు గమనించినట్లయితే మారుతున్న వైవాహిక విలువల్నికూడా మీరు గ్రహిస్తారు.

ప్ర. సరేనండి. ఈయన నాకన్న అయిదేళ్ళు పెద్ద. మంచిదేనంటారా? మా నాన్నగారు మా అమ్మగారికన్నా పదేళ్లు పెద్దట!

జ. వివాహసమయానికి వధూవరుల వయస్సుల్లో ఎంత తేడా ఉండాలన్న విషయాన్ని ఆలోచించేటప్పుడు కొన్ని శారీరిక సత్యాలనుకూడా మనం దృష్టిలో పెట్టుకోవలసివుంటుంది. ఆడవాళ్ళ లైంగికజీవితం సర్వసాధారణంగా నలభై అయిదవ యేటితో చురుకుతనాన్ని పోగొట్టుకుంటుంది. కనీసం, తాను పోగొట్టుకున్నానని అనుకొంటుంది. మగవాళ్ళ లైంగికోత్సాహం ఏభయిఏళ్ళా, ఆ పైబడికూడా వుంటుంది. ఇది సగటు సంగతి. అటూఇటూ ఉన్నవాళ్ళుకూడా లేకపోలేదు. ఏభయి ఏళ్లు దాటినా లైంగికజీవితంలో హుషారుగా పాల్గొనే స్త్రీలనీ ఎరుగుదును. అలాగే నలభై అయిదేళ్ళకే పూర్తిగా పోగొట్టుకున్న మగవాళ్ళనీ ఎరుగుదును. కనుక భార్య భర్తకన్నా పదేళ్ళకు మించి చిన్నదికావటం మంచిదికాదని మా అభిప్రాయం.

ప్ర. నాకు నలభయిఅయిదేళ్లు వచ్చేసరికి ఆయనకు ఏభయియేళ్ళు నిండుతాయి. నాకు కామం ఉడిగిపోయిన ఆ రోజుల్లో ఆయనకు కామతాపం యెక్కువగా ఉంటుందంటారా?

జ. అలా యేం చెప్పలేం. ఎవరి శరీరతత్వాలు ఎలా వుంటాయో ముందుగా చెప్పలేంగదా! ఆరోగ్యంగాఉంటూ

ఆరోగ్యకరమైన దాంపత్య జీవితాన్ని అనుసరించేవారికి యీ సమస్య ఇంత తొందరలో రాకపోవచ్చు. సెక్సువల్ ఫ్రీడమ్ (Sexual Freedom) అన్న గ్రంథంలో రెనీ గుయాను వ్రాసిన వాక్యాలనుకూడా వినండి-

"ఆడదాని అంత తొందరగా మగవాడు ముసలివాడవటం జరగదు. ఉభయుల ఆరోగ్యమూ సవ్యంగా ఉన్న దశలో ఏభయి ఏళ్ళ మగవాడికన్నా నలభయ్యేళ్ళ స్త్రీ పెద్దదానిలా కనిపిస్తుంది. అంతేకాదు. పురుషుడిలో స్త్రీకి కనిపించే ఆకర్షణకీ, స్త్రీలో పురుషుడికి కనిపించే ఆకర్షణకీ శారీరక విషయాలలో చాలా తేడా ఉంది. మగవాడి అందచందాలు, శరీర సౌష్ఠవం మెరిసే జుట్టు- ఇవేవీ స్త్రీలకు ప్రత్యేక ఆకర్షణలుకావు. కనుక ఆ అందాలు సడలినా, జుట్టు నెరిసినా స్త్రీ అతన్ని అసహ్యించుకోవటం జరగదు. కాని, ఆదే స్త్రీ జుట్టు నెరిసి, పొట్టపెరిగి, స్తనాలు సడలి, ఏజవాహీక తన బిగిని కోల్పోయి కనిపిస్తే, ఆమె భర్తకు ఆమెను చూసేసరికి కామోత్సాహం కలుగదు. ప్రకృతి చలచిత్తాన్ని మనం గౌరవించకతప్పదు. ప్రకృతే స్త్రీని మగవాడి కన్నా చిన్న వయసులోనే ముసలిదాన్ని చేసివేస్తుంది. ఆమె "వరుసు" ఆయిపోయిన దశలో అతనింకా పూలరంగడిలా ఉంటే "మృత్యువు వేర్పరిచేదాకా వేర్పడమ"ని ప్రమాణంచేసిన ఆ దంతుపల్లిద్దరూ, లైంగికంగా వేర్పడిపోవటం జరుగుతుంది. ఎండి, వడిలి, సడలిపోయినస్త్రీనిచూసేసరికి ఏమగవాడికీ కామం కలగదు. అయినా అతను ఆమెతో కాపురం చేస్తున్నాడంటే, కేవలం యాంత్రికంగానే అలా చేస్తున్నాడనుకోవాలి. తన భార్యతో యవ్వనోత్సాహం పూర్తిగా నశించిపోవటం గమనించి నిరుత్సాహంతో కుమిలిపోతూ, జీవితంమీద ఆశవదులుకుని,

తానూ వృద్ధుడవుతాడు. అతని ఆశలన్నీ అడియాసలవటమే కారణం. నీతినియమాలతో బ్రతికే పెద్దమనుష్యుల జీవితాలన్నీ ఇలా కాలిపోవలసిందే." గుయాన్ మాటలు వినటానికి భయంకరంగా ఉన్నా, సత్యం అని గ్రహిస్తే చాలు.

సుధా- అందుకేకాబోలు— ఏభయియేళ్ళు నిండిన మగవాళ్లు అక్కడక్కడ పడుచుపిల్లల్ని ఉంచుకోవటం చూస్తున్నాం.

జ అవును. ఆ పరిస్థితిని సమాజం హర్షించదు. కాని, దానివెనుకనున్న మానసిక పరిస్థితులుమాత్రం ఇవే.

ప్ర. ముప్ఫయిఅయిదూ, నలభై ఏళ్ళ వయసులో కొందరు స్త్రీలు కూడా పరపురుషునితో సంపర్కం పెట్టుకోవటానికి ఇవే పరిస్థితులు కారణం కాదంటారా?

జ కాదనను. భర్తకీ, భార్యకీ మధ్య వయస్సులో చాలా తేడా ఉండటం కారణమయిఉంటుంది. లేదా ఇంతకు ముందే మనం చెప్పుకున్నట్లు ఆమెలో కామోత్సాహం ఇంకా దిగజారకముందే ఆమె భర్త "వృద్ధుడ"వటం జరిగి ఉంటుంది. ఈ పరిస్థితుల్ని కూడా మనం సానుభూతితో అర్థంచేసుకోక తప్పదు.

ప్ర. అయితే నా వయసిప్పుడు ఇరవై కదా! నేను పాతికేళ్ళ సుధాకర్ ని పెళ్ళిచేసుకోవటానికి బదులు ముప్ఫయేళ్ళవాణ్ని పెళ్ళిచేసుకోవటం మంచి దంటారా?

జ. కామమే మీ జీవితాలకి ముఖ్యమైతే అలాగేచేసుకోండి. కాని, వయసులో అంత తేడాఉన్న దంపతులమధ్య స్నేహంమాత్రంఉండదు. కామసంబంధాలకు లోపంఉండదు

మన ప్రాచీన హైందవధర్మశాస్త్రవేత్తలు కామాన్నే ప్రధానంగా తీసుకుని దంపతులమధ్య ఎక్కువ వయోభేదం ఉండాలని అన్నారు నిజమైన ప్రేమ పునాదిగా ఏర్పడే వివాహాన్ని గురించి హేవలాక్ ఎల్లిస్ ఇలా అన్నాడు.

"దాంపత్యజీవితంలో కేవల కామసామరస్యమే ప్రధానంకాదు. దానితో బాటు బహుముఖ, ప్రగాఢ అనురాగబంధంకూడా ఉండాలి. కుతూహలంలోనూ, అభిరుచుల్లోనూ, అనుభూతుల్లోనూ ఆ దంపతులమధ్య సామరస్యం పెరగాలి. ఉభయులూ తలిదండ్రులుగా ఏకమై, ఆర్థికంగానూ, హార్దికంగానూ సమైక్యమై కృషిచేయాలి. దంపతుల మధ్య అనురాగబంధానికి ప్రాధాన్యత పెరుగుతున్నకొద్దీ రాగ (కామ) బంధానికి ప్రాధాన్యత తగ్గి పూర్తిగా పోయినాపోవచ్చు. అయినా వారిదాంపత్యం పరస్పర ప్రేమాభిమానాల బంధాలతో పెనవేసుకుని స్థిరంగా, నిశ్చలంగా నిలబడిపోతుంది"

**ఏమంటారు?**

ప్ర. ఆడది తనకు సమవయస్కుణ్ని పెళ్ళాడటం మంచిదంటారా? లేక తనకన్నా ఇరవై, ఇరవై అయిదేళ్ళు పెద్దవాణ్ని పెళ్ళాడటం మంచిదంటారా?

**జ. మొదటిది మగవాడికి లాభం. రెండవది ఆడదానికి లాభం. మీ సంగతే చూడండి. మీకు నలభై అయిదేళ్ళు వచ్చేసరికి మీరు మీ భర్తకు లైంగికసంతృప్తినివ్వని దశలో ఆయన కొత్త కొత్త మనుష్యుల్ని వెతుక్కుంటాడు. మీరే ఓ నలభయేళ్ళ మగవాడిని పెళ్ళిచేసుకున్నారనుకోండి. ఆయినకు ఏభయ్యేళ్ళువచ్చేసరికి మీకు ముప్పయ్యేళ్ళుంటాయి. మంచి**

పై లాపచ్చీసులో ఉంటారు. కనుక పక్కింటి కుర్రవాళ్ళకేసి వలపుచూపులు కుమ్మరించటం ప్రారంభిస్తారు ఇది మీకు లాభం!

సుధా. మంచి అమ్మాయి అలా చెయ్యదనుకోండి!

జ. అలా చెయ్యని మంచి అమ్మాయిలు ప్రతిరోజూ భర్తని ఈసడిస్తూ, ఏడిపిస్తూఉంటారు. దీనికన్నా అదే నయం;

ప్ర. నలభయి యేళ్లు దాటిన తర్వాత ఆడవాళ్లుగానీ మగవాళ్ళుగానీ పెళ్ళిచేసుకోవటం మంచిదంటారా?

జ. స్నేహంకోసం పెళ్ళిచేసుకుంటామంటేతప్ప సంసారసుఖంకోసం చేసుకుంటామంటే మంచిదికాదంటాను. అయితే వాళ్ళిద్దరూ ఇదివరకు కొంతకాలం వేరు వేరుగా కాపురంచేసి వైధవ్యంవల్ల ఆమెగారూ, భార్య చనిపోయినందున ఈయనా కలిసి పెళ్ళిచేసుకోదలచుకుంటే మా అభ్యంతరం లేదు. ఉభయులూ వ్యక్తిగతంగా కామానుభవం గలవాళ్ళయినందున వారి లైంగికజీవితంలో ఏ లోపమూ యేర్పడదు.

సుధా. అంటే పురుషసంపర్కంలేని స్త్రీలు, స్త్రీ సంపర్కం యెరుగని పురుషులూ నలభయ్యేళ్లు దాటాక పెళ్ళికి పనికిరారంటారు.

జ. అవును; కామంకోసమేఅయితే. స్నేహానికి పనికి వస్తుంది.

ప్ర. పోనీ భర్తకన్నా భార్యయే పెద్దదయితే నష్టమేమిటండీ?

జ. ఆమెలో జవసత్వాలున్నంతకాలం ఆమె స్వర్గాన్ని చవిచూపిస్తుంది. అంత సుఖాన్ని ఏ పురుషుడికీ అతనికన్న చిన్న

వయసు భార్య ఇవ్వలేదు. ఆమెలో జవరత్వాలుడిగినతర్వాత ఆమె భర్త ఆమెకు దక్కడు.

సుధా. మాకు వెంటనే పిల్లలు పుట్టటం మంచిదంటారా?

జ. ఈ విషయంలో రెండురకాల అభిప్రాయాలున్నాయి. పెళ్ళయినతర్వాత ఏ కృత్రిమగర్భనిరోధక పద్ధతులూ అవలంబించకుండా కనదలచిన పిల్లల్ని కనేసి, ఆ తర్వాత ఆపరేషను చేయించుకోవటం మంచిదని కొందరంటున్నారు. భార్యాభర్తలిద్దరిమధ్యా మానసికసామరస్యం ఏర్పడి, ఆ దాంపత్యం స్థిరపడేదాకా గర్భనిరోధక విధానాలను పాటించి, ఆ తర్వాత సంతానం కనటం మంచిదని కొందరంటున్నారు. ఏం చేస్తే బాగుంటుందో మీరే ఆలోచించుకోండి.

ప్ర. మీ సలహా ఏమిటి?

జ. మొకటి రెండేళ్ళు ఆగి ఆ తర్వాత సంతానాన్ని కనటం మంచిదంటాను.

ప్ర. మా అమ్మకు పెళ్ళయిన పదినెలలకే మా అక్కయ్య పుట్టిందండి. నాకూ అలాగే కలిగితే మంచిదంటోంది.

జ. మీ అమ్మగారి అభిప్రాయంతో మీ నాన్నగారే ఏకీభవించరు. కావలిస్తే మీ నాన్నగారినడగండి.

సుధా. పెళ్ళవుతూనే వేవిళ్ళు, పురుళ్ళు తయారయితే పెళ్ళిచేసుకున్న సుఖమేముందండీ?

జ. విన్నావాఅమ్మా! మగవాళ్ళ దృక్పథం అలా వుంటుంది. వాళ్ళ సంతోషంకూడా చూడాలిగదా!

ప్ర. ఎంతమంది పిల్లలుంటే మంచిదంటారు?

జ. తల్లి ఆరోగ్యం చెడకుండా కనగలిగినంతమందినీ, తండ్రి పోషించగలిగినంతమందినీ కనటం మంచిదంటాను. పిల్లల పోషణకీ, విద్యకీ తలసరి నెలకొక్కంటికి మూడువంద లయినా కావాలి. పన్నెండువండలు నెలజీతం తెచ్చుకునే ఆసామీ ఇద్దరు పిల్లల్ని మించి కనట మంచిదికాదు.

ప్ర. యెంత సంపాదనపరులైనా ఇద్దర్ని మించి కనటం మంచిది కాదం టారా?

జ. జాతివర్ధక శాస్త్రవేత్తలు చెప్పిన సంగతిచూస్తే, ఇద్దరు పిల్లలు గల కుటుంబానికి చప్పున అంతరించిపోయే అవకాశాలెక్కువగాఉన్నాయి. తండ్రి సంపాదనా, తల్లి ఆరోగ్యమూ బాగుండేపక్షంలో ముగ్గురునలుగురు పిల్లలుండటం మంచిదని మా అభిప్రాయం.

ప్ర. తాత్కాలిక గర్భనిరోధక పద్ధతి ఏదైనా చెపుతారా?

జ. డూషింగ్ చేసుకోవటమే చాలా మంచిదమ్మా! ఇది ఆరోగ్యానికి అన్నివిధాలా మంచిది.

ప్ర. మేమిద్దరం పరీక్ష చేయించుకోవాలనుకుంటున్నాం.

జ. మంచిదే. మరోసారి రండి.

---

# తాంత్రిక కామం

—ఆచార్య రజనీష్

ఒకానొక దృక్పథానికి ఇచ్చే శాస్త్రీయసమన్వయాన్నే తత్వశాస్త్రమని అంటాము. తంత్రానికికూడా ఒక ఫిలాసఫీ ఉంది. జీవితవాస్తవాన్ని గుర్తించి, నసుగడను అధారంగా చేసుకుని ఈ తంత్రశాస్త్రం మన భారతదేశంలో అనాదిగా వెలిసింది. భగవంతుడున్నాడా?— మోక్షం ఉందా?— స్వర్గనరకాలు ఉన్నాయా?— ఈ ప్రశ్నలకు తంత్రశాస్త్రంతో సంబంధంలేదు. జీవితపునాదికి సంబంధించిన సమస్యలతోనే తంత్రానికి పని. కనుకనే ప్రేమ, కామం— వీటికే తంత్రశాస్త్రం యెక్కువ ప్రాధాన్యతనిచ్చింది.

కామం శక్తిస్వరూపం. కామప్రభావంవల్లనే ప్రాణి పుట్టుక జరుగుతోంది. కామంతోనే దాని జీవితం పెనవేసుకుఉంది. కామం సడలగానే పండిపోయిన ఆకులా జీవితం రాలిపోతోంది. కనుక ఈ కామశక్తిని అర్థంచేసుకోకుండా, అధిగమించకుండా నీ వ్యక్తిత్వం అనేదిలేదు.

కొందరు సంఘర్షణద్వారా జ్ఞానాన్ని సంపాదించవచ్చుననుకుంటారు. అది సరికాదు. నీ మనస్సు దౌర్జన్యప్రవృత్తిలో ఉన్నంతకాలం నువ్వేదీ తెలుసుకోలేవు. ఆ దశలో దేనినీ గ్రహించటం సాధ్యంకాదు. సమస్త రహస్యాలూ నీ కంటపడకుండా దాగిఉండిపోతాయి.

నీలో కామశక్తి నిజంగా ప్రవహిస్తూఉన్నట్లయితే, దానికి సంపూర్ణంగా లొంగిపోవటానికే ప్రయత్నించు. అప్పుడే నీకో సత్యం అర్థమవుతుంది. కామం క్రొత్తప్రాణిని సృష్టించటమేకాదు: నీలో ప్రాణోత్సాహాన్ని పెంపొందింపజేస్తుంది. నవజీవాన్ని పల్లవింపజేస్తుంది.

ప్రేయసీప్రియులిద్దరూ ఒకరినొకరు కౌగలించుకుని, ఒకరిలోఒకరు విలీనమై అలాగే గంటలతరబడి ఉండిపోవాలి. అంతేగాని, సూటిగా రతిలో

ప్రవేశించి, చప్పున తమ అనుబంధాన్ని ముగించుకోవటానికి ప్రయత్నించ కూడదు. భావప్రాప్తికై పొగులాడకుండా ఒకరి కౌగిట్లో ఒకరు అదమరిచి విశ్రాంతి తీసుకోవటంద్వారా ఉభయులూ యవ్వనశ్రీలను పెంపొందింపజేసు కోగలుగుతారు.

అప్పుడే చాలా మార్పులు వస్తాయి. ఉభయులశరీరాలలోనూ రసాయ నికమార్పులు జరుగుతాయి. భార్యాభర్తలిద్దరూ విద్యుద్ఘటంలోని ఋణ, ధన ధృవాలవంటివారు. ఒకరి కౌగిట్లో ఒకరు తిరిగి విద్యుద్దీకరణం పొందుతారు. అనగా వారిలో ఈ శక్తి మరింత ఉద్ధృతంగా ఉత్పన్నమవుతుందన్నమాట! ఎక్కువసేపు పరస్పర ఆశ్లేషణలో గడపటంద్వారా వారు తమ జవాన్ని (వైటాలిటీ) పునరుద్దీపింప జేసుకోగలుగుతారు. కనుకనే ఈ రకమైన సిసలైన బ్రహ్మచర్యాన్ని పాటించే స్త్రీ పురుషులు కొత్త శక్తితో, కొత్త కాంతితో ప్రకాశించటం చూస్తున్నాం.

ఆధునిక విజ్ఞానశాస్త్రపరిశోధనలు చాలా సత్యాలను వెల్లడిలోకి తెచ్చా యి. మాష్టర్స్, జాన్సన్‌లు తొలిసారి రతిని శాస్త్రీయంగా రికార్డుచేశారు. వారి పరిశోధనలప్రకారం నూటికి డబ్బయిఅయిదుమంది మగవాళ్ళు శీఘ్రస్ఖ లనంతో బాధపడుతున్నవాళ్ళే. నూటికి తొంభయిమంది స్త్రీలు రతిలో యెన్నడూ భావప్రాప్తిని అనుభవించటమే జరగలేదు.

అంటే ఏమిటి?

**స్త్రీలకు చిరాకు యెక్కువగా కలుగుతోందన్నమాట రతిపేరు చెపితే చిరాకుపడే దుర్దశకు స్త్రీజాతి వచ్చేస్తోంది అలాంటి స్త్రీలకు యోగాభ్యాసంగాని, వేదాంతంగాని, మత విశ్వాసాలుగాని శాంతినివ్వలేవు. తమ భర్తలతో వారు సుఖంగా కాపురం చేసుకోటానికి వేవీ యేమాత్రం సహాయపడ టంలేదు. ఈ సత్యాన్ని ఈనాటి వైద్యశాస్త్రమూ, అలనాటి**

తంత్రశాస్త్రమూ ఒకేవిధంగా గుర్తించాయి. దాంపత్యజీవితంలో భార్యకు భావప్రాప్తి ద్వారా సంతృప్తి లభించని పక్షంలో ఆ కుటుంబానికే అది సమస్యగా తయారవుతుందన్న సత్యాన్ని అవి అంగీకరించాయి. ఈ సంతృప్తి లభించకపోవటం వల్లనే స్త్రీలు కామద్వేషులవుతున్నారు అలనాటి సమాజం ఈ సత్యాన్ని గ్రహించి, మగవాడికి కామశిల్పాన్ని నేర్పటానికి బదులుగా స్త్రీలకు పువ్వుల్నీ, పరిమళద్రవ్యాల్నీ, చీరల్నీ, నగలనీ, ఐశ్వర్యాన్నీ లంచంఇచ్చి— తద్వారా ఒప్పించి రతిలోకి దింపుకోవాలని మగవాళ్ళకు నచ్చచెప్పింది. ఇది అన్యాయంకాదా? యే రతివల్ల స్త్రీలకు ఆనందం కలగటంలేదో, ఆ రతిలోకి ప్రవేశించవలసిన అవసరం స్త్రీలకుమాత్రం యేముంది?— ఎలాగో మగవాడు తన అవసరం గడిపేసుకుంటున్నాడు. పురుషుని కామాన్ని తీర్చే సాధనంగా తాను ఉపయోగపడ్డానని స్త్రీ ఆవేదనతో పరితపించిపోతోంది.

స్త్రీ శరీరంలోని ప్రతికండరధాతువూ ప్రకంపించి, ప్రతి కణమూ జీవముతో ఉజ్వలించేటట్లు చేయగల భావప్రాప్తి సుఖం ఈ సమాజంలోని స్త్రీలల్లో నూటికీ తొంభయిమందికి ఎందువల్ల కలగటంలేదు? కామద్వేషంతో కూడిన వైఖరి వల్లనే. కామాన్ని తిరస్కరించే స్వభావం స్త్రీజాతిలో నిబిడీభూతమై ఉంది. దానికితోడు నిరుత్సాహకరమైన రతి అనుభవాలేర్పడుతున్నాయి. పర్యవసానంగా స్త్రీలు తమ కామాన్ని అణచుకోసాగారు. జడురాళ్ళయిపోయ్యారు.

మగవాడికిమాత్రం రతివల్ల ఆనందం కలుగుతోందా? అతగాడు రతిజరుపుతున్నంతసేపూ తానేదో మహాపాపకార్యం చేస్తున్నాననే అనుకుంటున్నాడు

తుచ్ఛమైన కామాన్ని జయించి, తానొక "మహాత్ముణ్ణి" కావాలని పరితపిస్తూ ఉంటున్నాడు.

మహాత్ముల్ని వదిలించుకోవటం చాలా కష్టం నువ్వు రతి జరుపుతున్నప్పటికీ నీ మనస్సులో వాళ్లు బైఠాయించుకునే ఉంటున్నారు. రతి పరాకాష్టకొచ్చినసమయంలోకూడా ముగ్గురుంటున్నారు— ఒకటి నువ్వు; రెండవది నీ భాగస్వామి; మూడవది నీ మనస్సులోని మహాత్ముడు. ఒక వేళ మహాత్ముడు లేడనుకో, ఆయనకుబదులు దేవుడుంటున్నాడు! ఆ దేవుడు నువ్వు ఈ తప్పు చేయటం కళ్ళారా చూస్తున్నాడు. ప్రజలు మనస్సులో భగవంతుడు పీపింగ్ టామ్ (తలుపుకన్నంలోంచి దొంగతనంగా చూచేమనిషి) లాంటివాడు. ఎప్పుడూ నీమీద కన్ను వేసేవుంచుతాడు. ఈ వైఖరివల్లనే నీలో ఆందోళన కలిగి నీకు శీఘ్రస్ఖలనం అవుతోంది.

## జీవన శక్తికి లొంగిపోవాలి

ఆందోళనలేనిపక్షంలో మగవాడు స్ఖలనం కాకుండా కొన్ని గంటలయినా రతి జరపగలుగుతాడు— గంటలేకాదు; కొన్నిరోజులుకూడా ఏకధాటీగా జరపవచ్చు. అలాంటి అవసరం ఏ పరిస్థితులలోనూ రాదనుకోండి. నిజమైన ప్రేమికులు కామాన్ని సేవిస్తూనే సంలీనం కాగలరు. ఎటొచ్చీ ఈనాటివలె, కామం ఉద్రేకస్థితికి రాకూడదు. ఒకానొక ప్రగాఢ సంలీనస్థితి రావాలి. ముందుగా నువ్వు జీవశక్తికి లొంగిపోకుండా దీనిని సాధించలేవు. సాధించినతర్వాతనే నువ్వు నీ ప్రియురాలికి నిన్ను పరిపూర్ణంగా సమర్పించుకో

కలిసిన స్థితికి రాగలుగుతావు. అదెలాగో తంత్రశాస్త్రం చెపుతున్నది. విను.

కామోద్రేకం యెక్కువగా ఉన్నప్పుడే నీకు రతిని జరపాలన్న కాంక్ష ఉంటుంది. అది సహజం. కాని. తంత్రశాస్త్రం ఏమని చెపుతున్నదో తెలుసా? కామోద్రేకం యెక్కువగా ఉన్నప్పుడే రతిని జరపకూడదంటుంది. నిజానికి దంపతులిద్దరూ ఒకరినొకరు రెచ్చగొట్టుకుని రతికి ఉపక్రమిస్తారు. ఇలా ఒకరినొకరు రెచ్చగొట్టుకుని ఆవేశస్థితిలోకి ప్రవేశించటంవల్లనే వారు తమ సామర్థ్యాన్ని (ఎనర్జీ) పోగొట్టుకుంటున్నారని తంత్రశాస్త్రం చెపుతున్నది. ప్రశాంతంగా మనస్సు నిశ్చలస్థితిలో నిదానంగా ఉన్నప్పుడే (ఈ స్థితికే సమాధి అనిపేరు) ప్రణయచేష్టలకు ఉపక్రమించండి. ముందు మీ మనస్సు సమాధిలోకి ప్రవేశించాలి. అప్పుడు ప్రణయాన్ని ప్రారంభించాలి. అందులోకూడా హద్దు దాటిపోకూడదు. వెర్రిఆవేశం తెచ్చుకోకూడదు. ఏమాత్రం తీవ్రస్థాయికి పోకూడదు. అప్పుడే మీ శక్తియావత్తూ మీ అదుపులో ఉంటుంది.

భార్యాభర్తలిద్దరూ రతి జరుపుకుంటున్నారంటే, ఆ యిద్దరూ కొట్టుకుంటున్నట్లుండకూడదు. తలిదండ్రుల ప్రణయకలాపాల్ని రహస్యంగాచూచి, అదేదో కొట్లాటగా అపోహపడి పిల్లలు హడలిపోయిన సందర్భాలెన్నో ఉన్నాయి. వారి శృంగారం అంత అసహ్యకరంగా, భయంకరంగా ఉందన్న మాట!

ఇద్దరు కలిసి పాడుతున్నారనుకో- వారి కంఠాలు రెండూ యేకమై ఒకదానిలో ఒకటి లీనమవుతాయి. ఇద్దరుకలిసి నృత్యం చేస్తున్నారనుకో! వారిద్దరి శరీరాలు ఒకేరకమైన లయలో, నియమంలో, తాళంలో, గతిలో కదులుతూ ఆ ఇద్దరూ ఒకే వ్యక్తిగా సంలీనమైపోతారు. ఈ లీనావస్థనే (రిలాగ్జేషన్) తంత్రం ప్రశంసిస్తోంది. తంత్రానికి అర్థం ఇదే. ఆ విధంగా తంత్రం యేమాత్రం కామప్రక్రియకాదు. అయినా

దానికి కామంతో పనిఉంది. ఈ సంలీనస్థితిలో కలిగే బ్రహ్మా నందంలోనే ప్రకృతి తన రహస్యాలను వెల్లడిస్తోంది.

ఒకవిధంగా కామం ప్రాణికర్త అవుతున్నది. మరోవిధంగా కామం ప్రాణ హర్త అవుతున్నది. దానిద్వారా నువ్వు హరించుకుపోతున్నావు; క్షీణించిపోతున్నావు; చచ్చిపోతున్నావు.

రెండవది: నువ్వు నీ ప్రియురాలితో పూర్తిగా సంలీనమైన దశలో నీ ఆలోచనలు పనిచెయ్యటంలేదు అనగా నీ మనస్సు పనిచేయటంలేదన్నమాట! నీ గుండెమాత్రమే కొట్టుకుంటున్నది. దీనినే సమాధిస్థితి అంటాము. నీ ప్రణయమే నిన్ను సమాధిస్థితిలోకి పంపాలి అలా పంపనినాడు ఇక ఏదీ నిన్ను పంపలేదు.

ప్రేమకి దాని స్వంత సమాధిస్థితి ఉన్నది; కాని, మీకు ప్రేమంటే తెలియదు. మీకు తెలిసిందల్లా రతిమాత్రమే. మీ శక్తిని వ్యయపరచుకోవటంవల్ల కలిగిన అనర్థం, అశాంతికూడా మీకు అనుభవమే. అందుచేతనే మీరు నిరాశా నిస్పృహలకు లోనయి, బ్రహ్మచర్యాన్ని పాటించటం మంచిదనుకుంటారు. కాని. దానివల్ల ప్రయోజనంలేదు. బ్రహ్మచర్యమంటే స్త్రీకి దూరంగా ఉండటమని అర్థంకాదు. స్త్రీతో సంలీనమవటమని అర్థం. అదికూడా ఒకానొక సమాధిస్థితి. సమాధి ఏమిటో తెలియనిమీరు కేవలం కోపంతోనూ, నిస్పృహతోనూ రతికి దూరం కాగలరేగాని, బ్రహ్మచారులుకాలేరు. ఆవేశస్థితితో చేసుకున్న ఏ నిర్ణయమూ నిలబడదు. అందుకే ఇరవైనాలుగుగంటలన్నా దాటకముందే మళ్ళీ మీరు రతికి సిద్ధపడతారు.

కామం ప్రగాఢమైన విషయమని తంత్రం చెపుతోంది. కామమే జీవితం గనుక! దురభిప్రాయాలను మనసులోపెట్టుకుని తంత్రానికి వ్యతిరేకులు కావద్దు, అప్పుడు అది ప్రమాదకరంకాదు; అప్పుడే అది జీవితాన్ని సుసంపన్నం చేస్తుంది.

## కామానుభవాన్ని సమాధిగా మార్చటం యెలాగ?

ఇందుకుగాను రతిలో అనుసరించవలసిన ప్రత్యేక ఆసనాలేవ

యినా ఉన్నాయా? శరీరం యే స్థితిలో ఉన్నదనేది ప్రధానం కాదు. మనస్సు యే స్థితిలో ఉన్నదనేదే ప్రధానం. అనగా మన వైఖరి యెట్లా ఉన్నదని? నీ మనస్సు మారగానే నీ శరీరం ఉండే స్థితికూడా మారుతుంది. అనగా ఆ రెండిటికీ విడదీయరాని సంబంధం ఉందన్నమాట!

ఆసనాలగురించి ఆలోచించకండి. ఆ జీవశక్తికి మీరు ముందుగా అంకిత మయిపోండి. అప్పుడు మీ శరీరాలు వాటికవే దాని కనుకూలమైన పొజిషన్స్ లోకి వస్తాయి.

ప్రతిరోజూ పరిస్థితులు మారుతూఉంటాయి. కనుక ఒకే పొజిషన్ అనుసరించాలన్న నియమంలేదు. మీ ప్రయత్నం మానండి. పరిస్థితులకనుగుణంగా ప్రతీదీ మారుతుంది. అందులోనే సామరస్యంఉంది. ఆ సమయానికి ఏ భంగిమ అనుకూలంగా ఉంటుందో దానిని అనుసరించాలేగాని, ముందుగా ఫలానా భంగిమ అంటూ నిర్ణయించుకోకూడదు. నిర్ణయానికి రావటంకూడా ఒక సమస్యయే. ప్రేమలో విహరించేవారి మనస్సులో ఏ సమస్యలూ ఉండకూడదు అందుకే రతికిముందు ఏ కామశాస్త్రాలనూ సంప్రదించవలసిన పనిలేదని అంటాను.

రతిశాస్త్రాలు ఉన్నాయంటే దాని అర్థంయేమిటి? మానవమేధస్సు యే రకం వరవళ్ళను సృష్టిస్తున్నదో తెలుసుకోవటమేగదా! ఎలా ప్రేమించాలో తెలుసుకోవటంకోసం గ్రంథాలను తిరగవేయటంద్వారా, నువ్వు సంభోగాన్ని కేవలం మేధాసంబంధమైన విషయంగా మార్చివేస్తున్నావన్నమాట! ముందుగా మనసులో వల్లించుకుని, ఆ ప్రకారం చేస్తావు. కనుకనే అది కృత్రిమమవుతున్నది; నిజమైన అనుభ

వంకాయకుండా పోతున్నది.

దేనికి భయం? నీ ప్రియురాలిముందే నువ్వు నిర్భీతిగా ఉండలేకపోతే ఇంకెక్కడ ఉండగలవ్? భయాన్ని విడిచిపెట్టు; అనురాగాన్ని ప్రసరించు. నిజమైన జీవశక్తి నీలో జ్వలించటం ప్రారంభంకాగానే దాని మార్గాన్ని అదే చూసుకుంటుంది. నీ జీవితసమస్తానికీ సార్థకత కనిపిస్తుంది. అప్పుడే నీ సమస్త జీవితాన్నీ ఆ దేవికి— నీ ప్రియురాలికి అర్పించగలవు. భక్తజయదేవుడు, ధనుర్దాసు, దేవదాసు, మజ్నూ— ఇదే చేయగలిగారు

భార్యాభర్తలిద్దరూ ఒకరి కౌగిట్లో ఒకరున్నప్పుడు యెన్నడూ రతిని గురించి ఆలోచించకూడదు. యెప్పుడో ఆఖర్న అప్రయత్నంగా దానికదే జరగవచ్చు. జరక్కపోనూవచ్చు.

ఆధునిక కామశాస్త్రాలు కొన్ని సమస్యలు తెచ్చిపెట్టాయి. వాటిని చదివి, ఆ ప్రకారం చేయలేకపోతున్నానని బెంగ పెట్టుకుంటావు. భార్యకు భావప్రాప్తి కలుగుతుందో లేదో అన్న ఆ వేదన నీకు యెక్కువవుతుంది. ఆమెకూడా కలిగినట్లు నటిస్తుంది. అంతా నటనగానే మారిపోతుంది. మానసికవ్యధ యెక్కువకావటంవల్ల నీకు అసలైన ఆనందమే లభించదు.

నీ భార్యకు నిన్ను సమర్పించుకుంటేచాలు; ఏ ఆలోచనా ఉండకూడదు. అంతే. ప్రతీ శరీరంలోనూ సెక్సుకేంద్రాలున్నాయి. వాటికో కార్యక్రమముంది. వాటిపని అవి చూసుకుంటాయి.

భగవంతుడిముందు ఏ ఆలోచనాలేని కాళీబుర్రతో నువ్వు నిన్ను అర్పించుకున్నట్లుగానే నీ ప్రియురాలి కౌగిట్లోకూడా నిన్ను నువ్వు అర్పించుకో! భర్తకు భార్యా, భార్యకు భర్తా ఈ విధంగా తమనుతాము అర్పించుకోవటం శ్రేష్టం.

**తాంత్రిక రతికీ, సామాన్య రతికీ ఉండే తేడా ఏమిటి?**

సామాన్య రతిలో నీ శారీరిక ఉద్వేగాన్ని చల్లార్చుకుంటావు. నీ శరీరం

తేలికయి, ఆరోగ్యం బాగుపడుతుంది నిద్రవస్తుంది. మనసూను, శరీరమూ ప్రశాంతంగా ఉంటాయి.

తాంత్రికరతి అలాకాదు. ఇందులో నీ శక్తిని పోగొట్టుకోవటం జరగదు స్ఖలనంగాని, భావప్రాప్తిగాని జరగకుండాచేసే రతి ఇది.

**సామాన్య రతిలో నీ భావప్రాప్తి శిఖరస్థాయికి చేరుకుంటే తాంత్రికరతిలో నీ భావప్రాప్తి పాతాళస్థాయికి చేరుకుంటుంది. మొదట్లో ఈ రెండు ప్రక్రియలకూ ఉత్సాహోద్రేకాలు ఒకేవిధంగా ఉండాలి. శరీరం వేడెక్కాలి సామాన్య రతిలో స్ఖలనం జరుగుతుంది; తాంత్రికరతిలో స్ఖలనం ఉండదు.**

సామాన్యరతిలో ఉద్రేకం అంతకంతకీ హెచ్చుతూఉండాలి. చివరికి శిఖరస్థాయికి చేరుకోవాలి. తాంత్రికరతిలో అలాకాదు. ఒకస్థితిదాకా పెరిగి, ఉభయులూ అన్యోన్య పరిష్వంగంలో బంధింపబడినతర్వాత, ఇక యేమాత్రమూ పెరగకుండా, తరగకుండా, అలాగే గంటలతరబడి నిలిచిపోవాలి. భావప్రాప్తి కాకూడదు. చివరకు అలాగే ఉభయులూనిద్రపోవాలి. దీనినే పాతాళ భావప్రాప్తి అంటారు.

సామాన్యరతిలో శక్తి వ్యయమవుతోంది గనుక వారానికొకసారికన్నా రతి జరుపుకోకూడదు. తాంత్రికరతిలో శక్తివ్యయంకాదుగనుక, విధివిరామం లేకుండా, యెప్పుడుపడితేఅప్పుడు, ఎంతసేపయినా పాల్గొవచ్చు. దీనివల్ల ఉభయుల శరీరాలలోనూ శక్తిసామర్థ్యాలు పెరుగుతాయి.

జంతువుల రతిని గమనించండి. అవి రతాన్ని ఏమాత్రం ఆనందించినట్లు కనబడవు. శారీరిక అవసరంకోసం యాంత్రికంగా అవి రమిస్తాయి. శరీరంలో శక్తి మరీ యెక్కువయినప్పుడు, విమోచనంకోసం, రమిస్తాయి. రైలింజన్‌లో ఆవిరి యెక్కువయినప్పుడు బయటకు విడిచిపెట్టినట్లె ఇదీను.

జంతువులు సంవత్సరానికొకసారి ఏదో ఒక కార్తెలోనే ఇలాచేస్తాయి.

మనిషి నిత్యమూ ఆ పని చేస్తున్నాడు. అందుకే జంతువుల్లో ఉండే శక్తి మనుష్యుల్లోలేదు. రతి అనంతరం జంతువులు చాలా దుర్బలంగా ఉంటాయని గమనించండి మనిషి మరీ దుర్బలుడయిపోవటానికి అనునిత్యకామానుభవమే కారణం.

జంతువుల్లా మనిషి కామాన్ని ఆనందించకూడదని నీతికోవిదులంటారు. జంతువులకు మనస్సులేదు. మనిషిమాత్రమే, మనస్సు కారణంగా, కామాన్ని ఆనందించగలడు. మనిషి యెంతగా కామాన్ని ఆనందించగలిగితే అంత మానవత్వం అతనిలో కలుగుతుంది. అందులోనూ స్ఖలనాన్ని నిరోధించి, కామాన్ని సేవించటంద్వారా, ఆనందించటంద్వారా అతగాడు పురుషోత్తముడు కాగలుగుతున్నాడు.

మనం తక్షణ కాఫీ త్రాగుతున్నాం; తక్షణ రతిని నిర్వహిస్తున్నాం' తక్షణ కాఫీ త్రాగటం మంచిదే. తక్షణ రతి మాత్రం మంచిదికాదు. శీఘ్రస్ఖలనం, తక్షణరతీఒక్కటే. ఈ రెండూ ఒకేవిధంగా మిమ్మ హతాశుల్ని చేస్తాయి నిర్వేదంలో ముంచెత్తుతాయి, రతివిషయంలో ఏమాత్రం తొందరపాటు పనికిరాదు, దానివల్ల మీకు కలిగే "కైవల్యం" (కేవలత్వం) లభించకుండాపోతుంది రతికైవల్యమే ఉత్తమదాంపత్యానికి పరమావధి-

ఏమాత్రం తొందరపాటు పనికిరాదు; మెల్లగా ఒక్కొక్క అడుగేవెయ్యి. ఉదయం వేళ, ప్రభాతపవనాలలో శరీరం పులకలెత్తేలా మనం చేసే వాహ్యాళివంటిదిరతి. టైము లేదని ఆఫీసుకు ఆదరాబాదరా పరిగెడుతున్నట్లు రతిజరపకు. నెమరు వేస్తున్నట్లు, నిర్లక్ష్యంగా, నిర్భయంగా, నిదానంగా సాగిపో. ఏమాత్రం తొందరగాని, హడావిడిగాని పనికిరాదు సుమా! ఏ క్షణంలోనైనా నువ్వు వెనక్కి వచ్చెయ్యొచ్చు. అంత స్థిమితంగాఉండాలి నీ నడక!

నిదానమే రతి సంవిధానం కావాలి. ఏమాత్రం తొందరపాటు కూడదు. ఏమాత్రం తొందరపాటుపడ్డా రతి పరాకాష్ఠకొచ్చి నీకు భావప్రాప్తి, స్ఖలనం అయిపోతాయి. అనగా పతనం అయిపోయిందన్నమాట! అలా ఆ ఉద్రేకాన్ని చంపుకోకు. నీ స్వాధీనం తప్పేలా పెంచుకోకు! దాన్ని అదుపులో ఉంచుకో.

రతిసమయంలో కళ్ళు మూసుకో. నీ భాగస్వామి శరీరాన్ని చేతితో, పెదవితో నిమురు. మహాద్భుతంగా ఏదో శక్తి నీలో ప్రవేశిస్తున్నట్లు తెలుసుకో. అందులో కరిగిపో. లీనమైపో.

మొదట్లో పాత అలవాటు నిన్ను బాధిస్తుంది. నీ స్వాధీనంలో లేకుండానే అంతా తొందరతొందరగా ముగిసిపోయ్యే పరిస్థితి వస్తుంది. అయినా నిరాశపడకు. నీ ప్రయత్నం మానకు. క్రమక్రమంగా నెలకో, మూడువారాలకో ఈ జితేంద్రియత్వాన్ని సాధిస్తావు. ఆ తర్వాత ఇక శిఖరాలుండవు. లోయలో నిశ్చింతగా తచ్చాడగలవు. అంటే? అంటే, పరిణత ప్రజ్ఞుడయ్యావన్నమాట!

అయితే "ఆవేశాన్ని అదుపులో ఉంచుకోవటం యెలాగ?" అని అడక్కు. అడిగితే ఏదో ఒక శిల్పంగురించి చెప్పవలసి వస్తుంది. ఆ శిల్పాన్ని అనుసరించటానికి కొంత ప్రయత్నం అవసరమవుతుంది. ప్రయత్నపూర్వకంగా జరిగే ప్రతీ పనిలోనూ ఆందోళన (టెన్షన్) ఏర్పడకమానదు. ఆందోళన అసలు లక్ష్యాన్ని చెడగొడుతుంది. అందుకే అంటాను: ఏమీ ఆలోచించకుండా

ఇక రతివిషయం. అందులోకూడా ఏమాత్రం ప్రయత్నం పనికిరాదు. ప్రియురాలితో, ఆమె శరీరంతో ఆడుకో. ఆమె శరీరంలోని సున్నితమైన భాగాలన్నిటినీ ప్రేరేపించు. జ్ఞాననాడులన్నిటినీ ప్రకోపించు. కుక్కపిల్లలు చెలగాటాలాడినట్లె మీరూ చెలగాటాలాడుకోవాలి. రతినిగురించి ఏమాత్రం ఆలోచించకూడదు. దానికోసం ప్రయత్నించకూడదు. రతి జరిగినా జరగక పోయినా ప్రమాదంలేదు.

రతి జరుపుతున్నసమయంలో మీ మనస్సు దానిని చప్పున ముగించాలని భావిస్తూ ఉంటుంది. నీకన్న ముందుకు పరిగెడుతుంది. అలా పరిగెట్టనివ్వకు. ప్రణయచేష్టల్లోనే నిమగ్నమై రతినిగురించి పట్టించుకోకు. అదీ అవుతుంది.

ఆవనీ. అయినతర్వాతకూడా ఆమె కౌగిట్లో అలాగే విశ్రాంతి తీసుకో.

**ఇద్దరూ కలిసిఉండండి; ఏకమై ఉండండి. సుఖంగా ఉండండి.**

ఆవేశాన్ని అణచుకోవాలంటే ఊపిరిలోపలికంటూ పీల్చండి, మెల్లగా పీల్చండి. తేలికగాపీల్చండి. సుఖంగా పీల్చండి. రతి దానికదే కొనసాగుతుంది,

మాటలాడకండి; మాటలు తపోభంగాన్ని చేస్తాయి; మనస్సును వినియోగించకండి, ఆలోచించకండి; శరీరాల్నిమాత్రమే వినియోగించుకోండి. మీ పరిష్వంగసమయంలో ఒకరిశరీరంలోంచి ఒకరి శరీరంలోకి ప్రవహించే వెచ్చదనాన్నీ, అనురాగాన్నీ గ్రహించండి; శక్తి పెల్లుబుకటం చూడండి,

ఈ విదంగా మీరు పాతాళంలోకి ప్రవేశించగలరు, మీలో మీ రతి నిర్వహణలో గొప్ప మార్పుని గమనించగలరు, సడలిన భావప్రాప్తిని సాధించగలరు, అప్పుడిక కామంతో సమస్యలేదు, ఉన్నదొక్కటే; ప్రగాఢ తపస్సు; దానికే సమాధి అనిపేరు,

(ఇల్లస్ట్రేడ్ వీక్లీ సౌజన్యంతో)

---



---

# అభిసారిక

## శాశ్వత చందాదారులుగా చేరండి.

అభిసారిక ఆంధ్రప్రదేశ్‌నుండి వెలువడే ఏకైక
దాంపత్య విజ్ఞాన మాసపత్రిక

అవివాహితుల భయాందోళణలను పోగొట్టి, చక్కని
సలహాలతో వివాహానికి ఆయత్తం చేస్తుంది.

వివాహితుల బలహీనతలను పోగొట్టి శారీరిక మానసిక
రుగ్మతలను తొలగించి అనురాగబద్ధంచేస్తుంది.

అవసరమైన చికిత్సలను ఏర్పాటుచేస్తుంది.
'అభిసారిక' శాశ్వత చందా రు 120/-లు మాత్రమే

వందలాది పాఠకులు శాశ్వత చందాదారులుగా
చేరుతున్నారు. మీరూ చేరండి.

అభిసారిక: దాంపత్య విజ్ఞానమాసపత్రిక
సామర్లకోట 533 440

# అడగండి చెపుతాను

(ఈ శీర్షిక క్రింద పాఠకుల దాంపత్యసమస్యలకూ సెక్సుసమస్యలకూ జవాబులివ్వబడతాయి. మీ సమస్యతోబాటు మీ ఎడ్రస్ వ్రాసిన కవరు కూడా జతపరిచి పంపాలి. సమస్య నెంబరు పాఠకులకు తెలియజేయబడుతుంది. ఎడ్రస్ లేని ఉత్తరాలకు జవాబులు లభించవు. సం॥)

## 7001 నాగపూర్

ప్రశ్న: నాకు వివాహమయినప్పటికీ మనస్సులో కోరిక కలగగానే జననాంగం స్తంభించటంలేదు, చేతితో ప్రేరేపించవలసివస్తోంది, ఈ విధంగాబలాత్కారంగా స్తంభించినా రెండుమూడు నిముషాలకన్న నిలబడటంలేదు.

జవాబు— అత్యధికంగా హస్తప్రయోగానికి పాల్పడి అలసిపోయినవారికి ఈ స్థితి వస్తుంది. ఈ స్థితివల్ల మానసికాందోళణ ప్రబలుతుంది. అది ఈ స్థితిని దృఢపరచటం జరుగుతుంది. వైటెక్సు వాడినందువల్ల హ॥ ప్ర॥ వల్ల కలిగిన దౌర్బల్యం తొలగిపోయినప్పటికీ మానసికనిరోధాలు తొలగిపోవు. కనుక శారీరిక ఆరోగ్యంకోసం వైటెక్సును పూర్తిగా వాడిన తర్వాత మానసిక అలవాట్లను మార్చుకోవటంకోసం సైకోథిరపీ చేయించుకోవటం అవసరం. అందుకే వైటెక్సు వాడిన

తర్వాత మా కార్యాలయానికి రమ్మని మా పేషెంట్లను ఆహ్వానిస్తున్నాము.

ప్రశ్న: పై పెక్సువల్ల వీర్యకణాలసంఖ్య పెరుగుతుందా?

జవాబు– బీజాలలో వీర్యకణాల ఉత్పాదన (స్పెర్మటో జెనిసిస్) ఏమాత్రం జరుగుతున్నా పై పెక్సు అట్టి ఉత్పాదన వేగాన్ని ఇనుమడింపజేస్తుంది స్పెర్మటో జెనిసిస్ ఏమాత్రం లేనివారికి ఏ మందూ పనిచెయ్యదు

ప్రశ్న: రతి అనంతరం నా భార్య జననాంగంనుంచి వీర్యం బయటకు వచ్చేస్తున్నది, తెలుపుకూడా బాగా అవుతున్నది,

జవాబు– తెలుపుకావటం స్త్రీలకు సహజం, ఆరోగ్యలక్షణమే అది. వ్యాధికాదు. పచ్చగా స్రావాలు రావటమే వ్యాధి. ఇక వీర్యం బయటకు వచ్చేస్తున్నదంటే దానికి యీ దిగువ కారణాలలో ఏ ఒకటయినా ఉండవచ్చు. 1. బస్తినిర్మాణ రీత్యా యోని అధోముఖంగా ఉండటం. 2. గర్భాశయకంఠం పై పోలిప్సు, ట్యూమర్సు ఉండటం. 3. యోనిద్వారాన్ని కండరాలతో బిగించి వీర్యాన్ని పట్టిఉంచటం చేతకాక పోవటం. కనుక వైద్యపరీక్షచేయించి శారీరిక కారణాలు లేనిపక్షంలో రతిశిల్పాన్ని మార్చటంద్వారా నివారించవచ్చు.

ఏదిఏమయినా ఇలాంటి సమస్యలు వైద్యపరీక్ష జరగకుండాను, ప్రాథమిక లైంగికవిజ్ఞానం పొందకుండానూ నివారింపబడవని మా మనవి.

7002 ప్రొద్దుటూరు

ప్రశ్న: నా భార్య బహిష్టయిన పదిరోజులకే రొమ్ములు గడ్డలుకట్టి నొప్పులుగా ఉంటున్నది. ప్రతీ 24 రోజులకీ బహిష్టవుతుంది. పద్దెనిమిది సంవత్సరాలుగా మాకు సంతానంలేదు. వీర్యం పరీక్ష చేయించాను. లోపంలేదన్నారు ఒక అండవాహికమాత్రమే బాగున్నదనీ, రెండవది చెడిపోయినదనీ నాభార్యకు యక్సరేతీసి తేల్చినారు. ఇక మాకు సంతానం కలగదా?

జవాబు– ఒక్క అండవాహికఉన్నా సంతానం కలిగే అవకాశం వుంది. మీ వీర్యంలో లోపంలేదుగదా! ఆమెకు అండస్రావంకూడా సక్రమంగానే అవుతున్నది. ఐనా మీకు సంతానం కలగటంలేదంటే మీరు అవలంబించే రత విధానాలలో లోపం ఉండితీరాలి. మీ దంపతులిద్దరూ మా కార్యాలయానికి వచ్చినట్లయితే మీతో సంప్రదించిన మీదట ఈ సమస్యను తేలికగా పరిష్కరించగలమన్న ధైర్యం మాకు కలిగింది. ఆలస్యంచేస్తే ఇక మీ కోరిక ఫలించదు.

ప్రశ్న: నాకు అంగస్థంభనంసరిగా కావటంలేదు. ఎప్పుడయినా ప్రయత్నంమీదట జరిగినా శీఘ్రస్ఖలనం అవుతోంది. దీనికి చికిత్స ఉంటే తెలుపగోర్తాను.

జవాబు– అసలు లోపం యెక్కడుందో యిప్పుడు మాకు అర్థమయింది. వైటెక్సు వాడితే అంగస్థంభనం సరిగా అవుతుంది. శీఘ్రస్ఖలనాన్ని నివారించుకునే విధానాలు మీరు స్వయంగా వచ్చినప్పుడు వివరిస్తాము. లేదా 'కామశిల్పం' చదవండి.

7003 కొత్తపల్లి

ప్ర: స్తంభనసమయంలో నా అంగం పొడవు మూడున్నర అంగుళా లున్నది. పొత్తికడుపుపై వెంట్రుకలు సరిగా పెరగలేదు. మా బంధువులు పెళ్ళి సంబంధాలను చెడగొడుతున్నారు. నాకేమో న్యూరోసిస్ లక్షణాలు యెక్కువగా ఉన్నాయి. నన్నేమి చెయ్యమంటారు?

జవాబు— మిమ్మల్ని స్వయంగా పరీక్షించకుండా మీకు ఏ సలహా చెప్పటం మంచిదికాదు కనుక మా కార్యాలయానికి ఒకసారి రావలసిందిగా కోరుతున్నాం

7004 బొంబాయి-58

ప్ర: నేను ఉదయం 8 గంటలనుండి సాయంత్రం అయిదుగంటలదాకా ఆఫీసులో పనిచేస్తున్నాను. ఆ తర్వాత రాత్రిళ్ళు పార్ట్‌టైమ్ ఉద్యోగంచేస్తున్నాను. ఇదిలావుండగా నా భార్యకు ఇటీవల సంతృప్తి సరిగా లభించటంలేదు. నాకు శీఘ్రస్ఖలనం కలుగుతోంది. ఈ పరిస్థితుల్లో మీ సలహా కోరుతున్నాను.

జవాబు— ఏ రోజునైనా ఎనిమిదిగంటలకు మించి పని చేయకూడదు. అప్పటికే శరీరం బాగా అలసిపోతుంది అలాంటిది రాత్రికూడా పార్ట్‌టైమ్ ఉద్యోగం చేసేవరికి సహజంగా నిస్సత్తువ మిమ్మల్ని ఆవరిస్తుంది. ఆ దశలో రతికి పూనుకుంటే వైఫల్యం తప్పదు. కావున పరిస్థితులు విషమించకుండా వెంటనే పార్ట్‌టైం నైట్‌జాబ్ మాని వేయండి. శీఘ్రస్ఖలనాన్ని జయించే విధానాలు "కామశిల్పం"లో వివరించాము. జాగ్రత్తగా అధ్యయనంచేసి, ఆచరించండి. ఎసిస్టటిక్ ఆయింటుమెంటుకూడా వాడండి. మందుల వివరాలను తెలుపుతూ వేరే

కార్డు పంపుతున్నాము.

7005 పెనుమంట్ర

ప్రశ్న: ఈమధ్య నా జననాంగం స్తంభించటంలేదు. బలాత్కారంపై
స్తంభించినా వెంటనే వాలిపోతోంది. అయిదేళ్ళు మా దాంపత్యజీవితం మీ
మార్గదర్శకత్వంలో హాయిగా సాగి ఇప్పుడీ సమస్య యేర్పడింది. మాకు ఇద్దరు
పిల్లలు. ఇక పిల్లలు పుట్టకూడదను తలంపుతో రతిసమయంలో స్ఖలనమయ్యే
సమయానికి ముందు నా అంగాన్ని ఉపసంహరించుకుని బయటనే స్ఖలించటం
జరుగుతోంది...

జవాబు- చాలు. ఇక చెప్పకండి ఇది చాలా ఒడ్డలల
వాటు. దీనివల్ల మీ దంపతులిద్దరి లైంగికఆరోగ్యం దెబ్బతినే
అవకాశంవుంది. అప్పుడే మీకు ప్రారంభమయింది. ఇక సం
తానం వద్దనుకుంటే ఆపరేషన్ చేయించుకోండి. లేదా
Vinegar దూదితో తడిపి రతికిముందు బీజవాహికలోపలి
కంటా చొప్పించుకున్నా గర్భోత్పత్తి కాదు. రతిజరిగిన అనంత
రం వీర్యాన్ని యోనిలోనే స్ఖలించాలిగాని, ఆకస్మికంగా
పురుషాంగాన్ని ఉపసంహరించి యోనిబయట విడుదలచేయ
కూడదు. దీనివల్ల మీ ఉభయులకూ నరాలవ్యవస్థ దెబ్బ తిం
టుంది. వైటెక్స్ తీసుకొంటూ తిరిగి మామూలు పద్ధతిలో స్ఖ
లించటం అభ్యసించండి.

7006 కుందనగుర్తి

ప్రశ్న: స్వప్నస్ఖలనాలు నాకు యెక్కువగాజరుగుతున్నాయి. దానికి

తోడు శీఘ్రస్ఖలనంకూడావుంది. వీటి నివారణకు తగిన మందు తెలుపగోరు తున్నాను.

జవాబు– మీకు వివాహమయిందోలేదో వ్రాయలేదు. బ్రహ్మచారులకు స్వప్నస్ఖలనాలు కాకుండానూ, వివాహితు లకు శీఘ్రస్ఖలనం కాకుండానూ ఎసీస్టటిక్ ఆయింటుమెంటు నివారిస్తుంది. మీకు వివాహమయిఉంటే "కామశిల్పం" తప్పక చదవండి. మీరు అవలంబించవలసిన రతివిధానాలు వివరింపబడ్డాయి.

7007 నకేరికల్లు

ప్రశ్న: నాకు వివాహం కాలేదు. ఐనా స్త్రీలతో అనుభవంవుంది వారిని యే విధంగానూ సంతృప్తిపరచలేకపోయాను. కనుక వివాహమంటే భయంగాఉంది. దానికితోడు నా అంగం స్థంభనసమయంలో నాలుగంగుళా లకు మించిలేదు. అంగం పెరుగుదలకు ఏదైనా అవకాశంఉందా? నేను వివా హం చేసుకోవచ్చునా?

జవాబు– అంగపరిమాణం 1 వంశపారంపర్య లక్ష ణాలమీదా 2. హార్మోనుల ఉత్పత్తిమీదా ఆధారపడి ఏర్ప డుతుంది. ప్రస్థుత పరిమాణానికి రెండవదాని ఉత్పత్తిలోలోపమే కారణమయితే వైటెక్సు వాడినందువల్ల పెరుగుదల కనిపిస్తుంది ఆనువంశిక కారణమయితే పెరుగుదలఉండదు. వైటెక్సువాడి చూడండి పెరుగుదల కనిపించినా, కనిపించకపోయినా ఆ తరు వాత ఒకసారి మా కార్యాలయానికి రండి. మనం అన్ని విష యాలూ సంప్రదించుకున్న మీదట వివాహం చేసుకోవచ్చో,

కూడదో నిర్ణయం తీసుకుందాం.

## 7008 వాగులాపల్లి

సమస్య: నా వయస్సు 20. హా॥ ప్ర॥ కు లోనయ్యాను. నడుమునొప్పి, అలసట, కాళ్ళూచేతులూ పీకు ఎక్కువయ్యాయి. శరీరం ఏమాత్రం పెరగ లేదు. సరిగా చదవలేకపోతున్నాను. పోనీ పెళ్ళిచేసుకుంటే నా జీవితం బాగు పడుతుందంటారా?

జవాబు- మీ శరీరారోగ్యం బాగుపడితేగాని మీరు పెళ్ళిచేసుకోకూడదు. హా॥ ప్రి॥ పూర్తిగా మానివెయ్యండి, రోజూ ఉదయం శరీరవ్యాయామం చేయండి. రాత్రి చదువు కున్నాక పడుకోబోయేముందు వేడినీళ్ళస్నానంచేసి, చాపపై పడుకోండి. వై టెక్సు 75 రోజులపాటు తీసుకోండి. ఉన్నపరిస్థి తుల్లో మీరు పెళ్ళిచేసుకుని మరో స్త్రీ జీవితం పాడుచేయటం మంచిదికాదు.

## 7009 చెరుకువాడ

సమస్య: నా వయస్సు 19. నాకు పెళ్ళయిపదినెలలయింది. నారొమ్ముల సమస్యయే మా ఇరువురిమధ్యా అన్యోన్యతలేకుండా చేస్తున్నది. నా రొమ్ములు చాలా చిన్నవిగా, కొత్తగా రజస్వల కాబోయే పిల్లవిలాఉన్నాయి. ఇదే నాకు తీరని లోపం. నా రొమ్ములు పరిపూర్ణంగా పెరిగే అవకాశంలేదా? ఉంటే తెలుపగోర్తాను. ఈ చెల్లెలిమీద దయఉంచి, నా ఆవేదన తీర్చి, నా కాపురం నిలబెట్టండని కోరుతున్నాను.

జవాబు- అమ్మా, నువ్వు నెలసరి సరిగ్గా బహిష్టవుతు న్నావో లేదో వ్రాయలేదు. హార్మోనుల లోపంవల్లనే నీ

స్తనాల పెరుగుదల సరిగా లేకుండాపోయింది. మావద్ద లభించే బెస్టోన్ క్రాంతకాలం వాడితే నీకా లోపం తొలగిపోతుందమ్మా! వివరాలు వేరే టపాలో పంపుతున్నాం.

7010 కామారెడ్డి

సమస్య: నేను వేసక్టమీ ఆపరేషన్ చేయించుకున్నాక పదవరోజున నా భార్యతో కలిశాను. ఆమె గర్భవతి అయింది. నలుగురిలోనూ చిన్నతనంగా ఉంటుందని, ఆమెకు ఎబార్షన్ చేయించాను, మళ్ళీ వేసక్టమీ చేయించుకోమంటారా? లేక నా భార్యకే ట్యూబెక్టమీ చేయించమంటారా? నిజంగా ఆపరేషను ఫెయిలయిందంటారా?

జవాబు— వేసక్టమీ చేయించుకున్న తర్వాత పది రోజులకు మీరు మీ భార్యతో కలియుటం, ఆవిడకు గర్భం రావటం జరిగాయి. ఇలా వచ్చే అవకాశం వుంది. ఆపరేషన్ చేయించుకోకపూర్వం శుక్రకోశాలలో చేరిన వీర్యకణాలు తొలి రతిలో భార్య గర్భకోశాన్ని చేరి గర్భోత్పత్తి కలిగించగలవు. అంతమాత్రాన ఆపరేషన్ ఫెయిలయిందని చెప్పలేం. కనుక, వెంటనే మీ వీర్యం పరీక్ష చేయించండి ఇప్పటికీ వీర్యకణాలుంటే, ఆపరేషన్ ఫెయిలయిందనే అర్థం. మరోసారి మరో కొత్త డాక్టర్ దగ్గర ఆపరేషను చేయించుకోండి. వీర్యకణాలు లేనిపక్షంలో ఇక మళ్ళీ ఆపరేషన్ చేయించుకోవలసినవసిలేదు. మళ్ళీ గర్భం రాదు. మీ భార్యకు ఆపరేషన్ చేయించాలంటే, పురుటిస్నానంలోపుగా చేయించాలి. అనగా మరో

బిడ్డ పుట్టాలన్న మాట!— ఆ పరిస్థితుల్లో మీరే చేయించుకో వటం మంచిది. ఏమయినా ముందుగా వీర్య పరీక్ష చేయించుకోవాలిగదా!

7011 అమృతసర్

ప్రశ్న: శీఘ్రస్ఖలనంతో బాధపడుతూ భార్యకు అసంతృప్తిని కలిగించే దురవస్థలో ఉన్నాను. ఈరకం పేషెంట్లను చక్కదిద్ది రతిసామర్థ్యం కలిగేటట్లు చేయటానికి మార్గమేదన్నా ఉందా?

జవాబు- శీఘ్రస్ఖలనం ఏ విధంగానూ వ్యాధికాదు తమ్ముడూ! అజ్ఞానావస్థయొక్క ఫలితం. ఈతలాగే రతికూడా నేర్చుకుంటే వస్తుంది. అందులో శిక్షణ పొందాలంటే వివాహం అయితీరాలి. భార్యయొక్క సహకారంకూడా వుండాలి. మావద్ద శిక్షణపొందిన దంపతులు ఈనాడు తమ సామర్థ్యాన్ని రుజువుచేసుకుని, వెనుకటి తమ దుస్థితి అజ్ఞానంవల్లనే కలిగిందని గ్రహించారు. 'కామశిల్పం' చదివి సరిజేసుకోండి. ఐనా సరిగాకపోతే, మీ దంపతులిద్దరూ మా కార్యాలయానికివస్తే, మీ సందేహాలు తీర్చి, మీకు అవసరమైన సెక్స్ ఎడ్యుకేషన్ చెపుతాము.

7012 నేకవాపురం

ప్రశ్న: స్త్రీకి ఎన్ని సంవత్సరాల వయస్సు వచ్చేదాకా సంతానం కలుగుతుంటుంది? అలాగే పురుషునికి?

జవాబు- స్త్రీకి ముట్లుడిగేవరకూ సంతానంకలిగే అవ

కాళం ఉంది. అనగా 45–50 సం॥లలో ఆమెకు ముట్లుడగటం జరుగుతుంది పురుషుడికి నూరేళ్ళు వచ్చినా గర్భకారకశక్తి వుంటుంది.

ప్రశ్న: మా పిల్లవాడి వయస్సు 12. సుమారు ఆరుమాసాలనుండి నడుస్తూవుంటే మూత్రము చుక్కలుచుక్కలుగా పోతూ నిక్కరు తడుస్తూవుంటుంది. కూర్చునివున్నా, నిద్రలోఅయినా ఇలా జరగటంలేదు.

జవాబు– కంప్రెస్సర్ యురిత్రై కండరం కొంచెం సడలి వుంటుంది. దానికి సరియైన వ్యాయామంచేయిస్తే తప్పకుండా ఈ అవస్థ తొలగిపోతుంది

## 7013

చేబ్రోలు

సమస్య: నా 16వ ఏట నా తండ్రి తాగివచ్చి మా అమ్మను అనుభవిస్తున్నప్పుడు దురదృష్టవశాత్తూ నా కంటపడింది. దానితో నా మనస్సు విరిగిపోయి నిర్లిప్తత, ముభావం ఏర్పడ్డాయి... నా స్నేహితులు రాత్రిపూట వీధుల్లోజరిగే సెక్సువిషయాలగురించి మాట్లాడుతుంటున్నప్పుడు నా అనుమానం నా తలిదండ్రులమీదకే పోతున్నది. నాకేదో అవమానంగా, కలవంపుగా ఫీలవుతున్నాను.

జవాబు– భార్యాభర్తల కలయికని ప్రకృతిధర్మంగా దేవుడే విధించాడు. ఈ సృష్టివ్యాప్తికది యెంతో ముఖ్యం. పవిత్రమూ, దైవనిర్ణయమూ అయిన ఈ సంధానాన్ని ఆయా స్త్రీపురుషులు తమ సంస్కారాన్నిబట్టి అనుభవిస్తూవుంటారు. లోకం ఏమనుకుంటేయేంగాక, మీ తలిదండ్రులు జరిపే ఈ సృష్టికార్యాన్ని నీచంగాగాని, అపవిత్రంగాగాని మీరు భావించకూడదు. మీ జన్మకే అది మూలకారణం.

రాత్రి వేళ రోడ్డున జరిగే కథలన్నీ మీ తల్లిదండ్రులకథలే అని భావించవద్దు. వాళ్ళని పూజించటమే నీ కర్తవ్యం.

## 7014 అలగానిపాడు

నాకు గనేరియా సోకినతర్వాత చికిత్స చేయించుకున్నాను అయినా బీజాలలో వెరికోసిల్ వెయిన్స్ దిగాయి ఇవి ప్రమాదకరమా? గజ్జల్లో బిళ్ళలు కట్టాయి. ఇవి గవదబిళ్ళలా? గవదబిళ్ళలవల్ల కలిగే ప్రమాదం ఏమిటి?

జవాబు- గనేరియాకూ వెరికోసల్ వెయిన్స్‌కీ సంబంధంలేదు ఆ రకం మానసికభయం మీకు అవసరంలేదు. బీజకోశం బరువెక్కి అడుక్కి లాగినందువల్లగాని, రక్తనాళాల్లో సూక్ష్మక్రిములు ప్రవేశించినందువల్లగాని వెరికోసిల్ వెయిన్స్ వస్తాయి. వాటివల్ల ఏ ప్రమాదమూ లేదు ప్రతీ మగాడికీ గజ్జల్లో గ్రంధులున్నాయి. వాటిని తడిమిచూచుకుని గవదబిళ్ళలనుకోవటం తప్పు గవదబిళ్ళలు జ్వరంతో బాటువస్తాయి ముందుగా దవడలక్రింద వేస్తాయి. ఆ తర్వాత గజ్జల్లోదిగి ముందుచెప్పిన గ్రంధులు వాచటం మీరు మంచం యెక్కటం జరుగుతుంది. ఆ దశలో ఈ గవదబిళ్ళలవల్ల బీజాలుచెడి, వీర్యకణాల ఉత్పత్తి చెడుతుంది సంతానం కలగదుగాని, సంధానానికి లోపంరాదు. మీవిషయం వైద్యపరీక్ష చేయించుకోండి.

## 7015 దుళ్ల

జవాబు- మీ సమస్యతీవ్రతనుబట్టి మీ దంపతులిద్దర్నీ

మా కార్యాలయానికి రమ్మని కోరుతున్నాము. కాకినాడ తాలూకా చామర్లకోట అయోధ్యరాంపురంలో మా కార్యాలయం ఉన్నది.

7016 అనకాపల్లి

సమస్య: నా వయస్సు 44. ఆరుగురు పిల్లలు. నాకు కామం పెచ్చుగా ఉంది. అది పూర్తిగా తగ్గాలంటే...?

జవాబు- ఏభయి దాటేసరికి దానికదే తగ్గటం ప్రారంభిస్తుంది. పిల్లలసంఖ్య కేమి, మీ భార్యాభర్తలు ఆరోగ్యంగా ఉన్నంతకాలం మీరు కామాన్ని చంపుకోవలసిన అవసరం మాకు కనబడటం లేదు. దీపం ఉన్నప్పుడే ఇల్లు చక్కబెట్టుకున్నట్లుగా కామం బాగున్నప్పుడే నిస్సంకోచంగా ఆనందించటం మంచిది.

7017 టంగుటూరు

సమస్య: ముఖ్యంగా నా అంగం చిన్నదయింది. కాని, స్త్రీని సంభోగించునప్పుడు మాత్రం ఏ లోపమూ లేదు. మామూలుగానే సంభోగించగలను. ఆ తరువాతనే నా అంగం చిన్నదవుతుంది. అందుకే నాకీ విచారం.

జవాబు- ఇందులో విచారించవలసిన అవసరం లేదు. ఇది సహజమే దీనివల్ల ఏ విధమైన నష్టమూ లేదుగనుక అనవసరపు భయాలను మనసులో పెట్టుకోవద్దు.

7015 హైదరాబాదు

సమస్య: నాకో స్నేహితుడున్నాడు. అతనూ నేనూ కలిసి చెడ్డపనులు

చేసేవాళ్ళం. అతను నా స్నేహంవిడిచిపెట్టి వెళ్ళిపోయినప్పటినుంచీ అశాంతిగా బుద్ధి కావటంలేదు. ఈ విషయం ఎగతాళిగా తీసుకోనవద్దు.

జవాబు– ఇద్దరు మగవాళ్ళ మధ్య ఈ రకం స్నేహం మంచిది కాదు మీరు విడిపోవటం చాలా మంచిదయింది. మళ్ళీ మొగవాళ్ళతో ఈ రకం స్నేహం చేయటం పూర్తిగా మానివేయండి. ఆడవాళ్ళతో స్నేహం పెంచుకోవటానికి ప్రయత్నించండి. స్త్రీ పురుషుల సమాగమమే ప్రకృతిధర్మం అదే శారీరకంగానూ, మానసికంగానూ ఉభయులకీ ఆరోగ్య దాయకమవుతుంది. కూడని పనికోసం పరితపించవద్దు.

## 7019 నల్లగొండ

సమస్య: ఆధ్యాత్మిక విషయాలలోకి మనస్సు మళ్ళించటం ద్వారా నాలోని కామాన్ని అణచుకోవటానికి ప్రయత్నిస్తున్నాను. కాని, ఇంతకు ముందు చేసిన హ॥ ప్ర॥ వల్ల పూర్తిగా నరాల దుర్బలత్వం వచ్చింది. అజీర్తి, అలసటా కలుగుతున్నాయి. మా చిన్నక్కగారి పెద్దమామకూతుర్ని నాకిద్దామని నిశ్చయించారు ఆ అమ్మాయిని చూడగానే మొదటిరోజున వణుకుడుప్రారంభమయింది. ఆ అమ్మాయితో ఎలా మాట్లాడాలో, ఏం మాట్లాడాలో అర్థం కావటంలేదు. మొదటిరోజు నేను ప్రవర్తించవలసిన పద్ధతిని తెలియజెప్పే పుస్తకమేమన్నా ఉందా?

జవాబు– మీలో న్యూరోసిస్ ఎక్కువగా ఉన్నందువల్ల వైటెక్స్ మందు వాడవలసిందిగా కోరుతున్నాము. తొలిరోజు మీరు వ్యవహరించవలసిన విధానాలను మేము ప్రచురించిన "రతిరహస్యం"లో వివరించాము. తప్పక చద

వండి. పై టెక్కు పూర్తిగా వాడినతర్వాత ఒకసారి మాకార్యాలయానికిరండి.

7020 ఉద్దేమర్రి

సమస్య: మా మరదలు దాంపత్యానికి పనికిరాదని మొగుడు వదిలేశాడు. యోనిద్వారం లేదన్నాడు. సికింద్రాబాద్ ఆసుపత్రిలో చూపిస్తే, ఆపరేషన్ చేసికూడా లాభంలేదని డాక్టర్లు చెప్పేశారు. ఇక ఆమె బ్రతుకు అంతేనా?

జవాబు- హార్మోనుచికిత్స చేయించినట్లయితే ప్రయోజనం ఉంటుందోలేదో ఆమెని పరీక్షించిగాని చెప్పలేం. సర్జరీ వల్ల ప్రయోజనం లేకపోయినా హార్మోనుచికిత్సవల్ల ప్రయోజనం లభించవచ్చు. కనుక, ఒకసారి మా కార్యాలయానికి తీసుకురండి.

ప్రశ్న: నా భార్యకు వక్షోజాలు శరీరానికి అంటుకుపోయేలా ఉన్నాయి మాకు సంతానంలేదు. వక్షోజాలు పెరిగేందుకు చికిత్స ఏదయినా చెప్పగోర్తాను.

జవాబు- మీ భార్యకు సంతానం లేకపోవటానికీ వక్షోజాలు సరిగా పెరగకపోవటానికీ ప్రత్యక్షసంబంధంఉంది. వక్షోజాలు సరిగా ఎదగని స్త్రీల గర్భకోశంకూడా శైశవావస్థలోనే వుంటుంది. మీరు బెస్ట్రోన్ మీ భార్యచే వాడించండి తప్పక ప్రయోజనం ఉంటుంది. వక్షోజాల పెరుగుదలతోబాటు గర్భకోశం పెరుగుదలకూడా జరిగే అవకాశం ఉంది.

7021 భువనగిరి

ప్రశ్నలు: హస్తప్రయోగానికి పాల్పడినవారికి అంగం చిన్నదయి

పోతుందా? నార్మల్ గా ఉద్రేకం వచ్చినవారికి అంగపరిమాణం ఎంతవుంటుంది? అంగం చిన్నదయితే సంతానం కలగదా? వివాహం కానివారు వీర్యాన్ని విడుదల చెయ్యకపోతే ప్రమాదమా? రతిలో మగవానికన్నా ఆడదానికే యెక్కువ సుఖం ఉంటుందని విన్నాను. నిజమేనా? వివాహంకాని ఆడవాళ్ళుకూడా మగవాళ్ళవలె ఉద్రేకాన్ని హ॥ ప్ర॥ ద్వారా చల్లార్చుకుంటారా?

జవాబు— హ॥ ప్ర॥ చేసిన యువకులకి ఆత్మన్యూనతాభావమూ, పాపచింతా, సంఘభయమూ కలుగుతాయి. అంగం చిన్నదై పోయిందన్న భ్రమ కలుగుతుంది. పురుషుల అంగ పరిమాణం వ్యక్తికొక రకంగా ఉంటుంది. సగటున నాలుగున్నర అంగుళాలుంటుంది. అంగం చిన్నదైనా వీర్యంలో వీర్యకణాలు సమృద్ధిగా ఉన్నప్పుడు సంతానం కలుగుతుంది. వివాహంకానివారు వీర్యాన్ని విడుదల చెయ్యకపోతే ఏ ప్రమాదమూ లేదు; రతిలో మగవానికన్నా ఆడదానికే యెక్కువసుఖం వుంటుంది. అదయినా పెళ్ళయిన కొత్తలోకాదు. వివాహంకాని ఆడవాళ్ళుకూడా మగవాళ్ళ ఉద్రేకాన్ని హ॥ ప్ర॥ ద్వారాచల్లార్చుకుంటారు.

**7022** శతకోడు

వివాహ సమాచారకేంద్రంద్వారా మీరు యువతీ యువకులకు ఏ విధముగా సంబంధాలు స్థిర పరుస్తారో తెలుపగోర్తున్నాను.

జవాబు- మాద్వారా వివాహం చేసుకోదలచినవారు తొలుత మా కార్యాలయానికి స్వయంగా రావాలి. వారితో మేము మాట్లాడినతర్వాత, మా సందేహాలకు సమాధానాలు

చెప్పాలి. అప్పుడు వారి సంస్కారానికి తగినసంబంధాలగురించి మేము చెప్తాము. ఈ పద్ధతివల్ల మనుష్యుల అంతస్థుల్ని మేము స్వయంగా బేరీజు వేసుకునే అవకాశం కలుగుతుంది.

7023 కావలి

నా భార్యకు రొమ్ములు చిన్నవిగా ఉన్నాయి. మాకు పెళ్ళయి రెండు సంవత్సరాలయింది. ఒక పాప పుట్టింది. పాప పుట్టిన రెండు నెలలవరకూ బాగున్నాయి. తర్వాత మొదటిమాదిరిగా తయారయ్యాయి. ఏమైనా మందు మీవద్ద వుంటే తెలుపగోరుతున్నాను.

జవాబు- బ్రెస్టోన్ వాడించండి. మీకు దిగులు తగ్గుతుంది ఆమె రొమ్ములుకూడా తగుమాత్రం పెరిగి ఆమె అందానికి వన్నె తెస్తాయి.

7024 పోలేవాండ్లపల్లి

నేను మీకు లోగడ ఉత్తరంలో వీర్యపరీక్ష చేయిస్తాననీ జీవకణాలు బ్రతికిఉంటే నేను బ్రతుకుతాననీ, లేకుంటే చచ్చిపోతాననీ వ్రాశాను. ఇప్పుడు పరీక్ష చేయించి రిపోర్టు పంపుతున్నాను. వీర్యకణాలు బ్రతికిఉన్నవా? వికృతకణాలుఉన్నవా? సంతానం కలుగుతుందా?

జవాబు- రెండు ఘనపుసెంటీమీటర్ల మీ వీర్యంలో 578, 00, 000 వీర్యకణాలున్నాయి. చలనశక్తి బాగుంది. తొంభయిశాతం సజీవంగా ఉన్నాయి. వికృతకణాలు లేవు. మీవల్ల గ్యారంటీగా గర్భోత్పత్తి అవుతుంది.

ప్రశ్న: మూత్రపరీక్షలో గనేరియా లక్షణాలేమైనా ఉన్నాయా?

జవాబు- గనేరియాకాదు, కొద్దిగా చీముకణాలున్నా

యి. కనుక పెన్సిలిన్ ఇంజెక్షనులు చేయించుకోవటంమంచిది.

7025 బెల్లంపల్లి

ప్రశ్న: నా భార్యకు వయస్సు 30. ఇద్దరు పిల్లలు. ఇప్పుడామె నెల సరి సరిగా కావటంలేదు. పైగా బహిష్టుముందు పొత్తికడుపు నొప్పితో బాధ పడుతోంది. పిల్లల తల్లులకుకూడా ఈరకం వ్యాధులు వచ్చాయంటే డాక్టర్లు ఆశ్చర్యపోతున్నారు. కారణం ఏమిటి?

జవాబు– మీ దాంపత్యంలో ఆమెకు రతిప్రేరణ కలుగుతోందేగాని భావప్రాప్తి కలగటంలేదు. కనుక పొత్తికడుపులోని సింపతిటిక్ నరాలన్నీ బిగిసిపోయి ఈ రకంగా తమ ప్రకోపాన్ని చూపిస్తున్నాయి. దీనినిబట్టి మీకు శీఘ్రస్కలనం యెక్కువగా ఉన్నదని అర్థమవుతోంది. ముందుగా దానికి చికిత్స చేయించుకోండి.

7026 ఇందిరానగర్

నాకు వివాహం కాలేదు. స్వప్నస్కలనాలద్వారా వీర్యం పోతోంది. ఫలితంగా నాకు నరాల దుర్బలత్వం వచ్చింది. నాకిప్పుడు పెళ్ళంటే భయంగా వుంది.

జవాబు– హ॥ ప్ర॥ వంటి దురలవాటును మానుకున్న అవివాహితులకు స్వప్నస్కలనాలు రావటం సహజం. దాని గురించి బెంగపెట్టుకోవలసిన పనిలేదు. కామపరమైన ఆలోచనలు మనస్సులోకి రాకుండా సాధ్యమైనంతవరకూ నిగ్రహించండి. రోజూ రెండు సంధ్యలా శరీరవ్యాయామంచేయండి

వివాహ యుక్తవయస్సు వచ్చిందిగనుక పెళ్ళిచేసుకోండి. వై టెక్సుకూడా వాడండి.

## 7027

నెల్లూరు

సైకోథెరపీ అంటే ఏమిటి గురువుగారూ? దాంపత్యంలో సమస్యలు ఏర్పడినట్లయితే భార్యాభర్తలిద్దరూ సైకోథెరపీ చేయించుకోవాలా? వై టెక్స ఎనీస్థటిక్ ఆయింటుమెంటు మీవద్ద ఉన్నాయా?

**జవాబు**- మనిషికి శారీరిక రుగ్మతలెలాగయితే ఉన్నాయో మానసిక రుగ్మతలుకూడా అలాగే ఉన్నాయి. కాని, మన ప్రజాసామాన్యానికి శారీరిక రుగ్మతల సంగతే కొంత వరకూ తెలుసుగాని, మానసిక రుగ్మతలగురించి సుతలామూ తెలియదు. చాలా శారీరక రుగ్మతలకు మానసికరుగ్మతలదే ముఖ్యమైన బాధ్యతఅని ఇటీవల శాస్త్రజ్ఞులు కనుగొన్నారు. ఆయా మానసిక రుగ్మతలను వికల్పంచేసి, విడివిడిగా లక్షణానుగుణంగా వాటికి నామకరణం చేశారు. ముఖ్యంగా దాంపత్యజీవితంలో సమస్యల్ని కలిగించేగుణం ఈ మానసిక రుగ్మతలకేఉంది. వీటిని విజ్ఞానంద్వారానే పోగొట్టటం జరగాలి. కేవలం ఔషధసేవవల్ల ఇవి పోవు వారి అజ్ఞానాన్నిరూపుమాపాలి మనుష్యుల్లోని మూఢనమ్మకాలు, నిషేధాలు, లగ్నతలు ఆరోగ్యకరమైన దాంపత్యజీవితానికి అవరోధంగా పరిణమిస్తాయి. దంపతులిద్దరిలోనూ ఈ మానసిక రుగ్మతలుండవచ్చు ఏ ఒక్కరిలోనైనా ఉండవచ్చు మానసిక రుగ్మతతో కూడిన

ఈ వైఖరివల్లనే వారి దాంపత్యం విఫలం కావటం జరుగు తోంది. కనుక భార్యాభర్తలిద్దరి వైఖరిలోనూ ఎవరి వైఖరి యెంతవరకూ ఆరోగ్యకరంగా ఉందో, ఎవరిలో ఏ రకం మానసిక వ్యాధులున్నాయో తెలుసుకోవలసిన ఆవశ్యకత సైకోథెరపిస్టుకి ఉంది. ఆ విధంగా తెలుసుకున్నాక ఆ మూఢనమ్మకాలనూ మానసిక నిషేధాలనూ, భయాలను, లగ్నతలను తొలగించి వారి వైఖరిని మార్చవలసివుంటుంది. ఈ రకం మానసిక పరిశుభ్రత చేసే కార్యక్రమానికే సైకోథెరపీ అనిపేరు. వివాహం చేసుకున్నవారిలో దాంపత్యసమస్యలు ఉత్పన్నమయినప్పుడు దంపతులిద్దరూ రావాలి. ఇద్దరికీ సైకోథెరపీ జరగాలి.

ఎస్థటిక్ ఆయింటుమెంటు. వైటెక్సు మావద్ద దొరుకుతాయి.

ప్రశ్న: హోమోసెక్సువాలిటీ అంటే ఏమిటి?

జవాబు- పురుషుడు పురుషునియందు కామాసక్తుడవటం.

7028 అమలాపురం

సమస్య; సంభోగసమయంలో నా అంగపూర్వచర్మం అంగంపై వెనక్కు కొంతవరకూ వచ్చి బాధ కలిగిస్తోంది. దీనివల్ల స్తంభన వైఫల్యం కలుగుతుంది. అంగంకూడా కొద్దిగా వాచటం జరుగుతోంది. దీనితో నాకు సంభోగమంటే భయం పట్టుకుంది.

జవాబు- అంగశీర్షం పెద్దదయి, అంగాన్ని కప్పిఉంచే చర్మం యొక్క ముఖద్వారం చిన్నదైన దశలో సంభోగసమ

యంలో చర్మం వెనక్కి జరిగి నెప్పి పెట్టటం, అంగస్తంభనం విఫలం కావటమూ జరుగుతాయి అంగం వాచటంకూడా జరుగుతుంది. అందుకే, ఇలాంటి పరిస్థితుల్లో ఉన్నవాళ్లు తక్షణం మంచి సర్జనును సంప్రదించి సుంతీ చేయించుకోవటం చాలా అవసరం. అ తర్వాతగాని ఈ సమస్య తీరదు.

7029

ముక్కలపల్లి

సమస్య: ఒకఅమ్మాయికి బహిస్టుస్నానం అయిన నాల్గవరోజున శోభనం అయింది. ఆ తర్వాత 208 రోజులకు ఆడశిశువు కలిగింది. తల్లీబిడ్డా క్షేమంగా ఉన్నారు. కొన్ని గ్రంధాలలో ఆడపిల్లఅయితే పదినెలల గర్భధారణ అవసరమనిఉంది. అందువల్ల భర్తకు అనుమానంగాఉంది. అట్టి గర్భం భర్తకుజరిగినట్లా? లేక శోభనంనాటికే ఆమె గర్భవతి అయిఉంటుందంటారా!

జవాబు– పరిపూర్ణ గర్భధారణకు 280 రోజులు పడుతుంది. ఇందులో ఆడపిల్లలకు ఎక్కువ, మగపిల్లలకు తక్కువా అంటూ లేదు. మీరు చెప్పినదాన్ని బట్టి ఈ బిడ్డ ఏడు నెలలకే పుట్టినట్లు తోస్తుంది. అలా పుట్టిన నెలలతక్కువ పిల్లలుకూడా లేకపోలేదు పాపపుణ్యాలు ఆ భగవంతుడికే తెలియాలి. అనవసరంగా మనస్సును పాడుచేసుకుని, తాను బాధపడి, భార్యనూ ఏ పాపం ఎరుగని బిడ్డనూ అవమానించటం మంచిదికాదు దేవుడిచ్చినదానిని కృతజ్ఞతతో స్వీకరించటమే మంచిది. అనవసరంగా ఆమెను అనుమానించి, అవమానించి, సంఘంలో తలవొంపులు తెచ్చుకోవద్దని మీ మిత్రునికి చెప్పండి. పాపపుణ్యాలెరుగని చిన్నపిల్లలు ఒకవేళ తప్పుచేసినా, వారిని క్షమించి కాపాడటంలోనే పెద్దరికమూ, ఔదార్యమూ ఉన్నాయి.

---

Edited Printed and Published by Sri D. RAMSHA at
Dharmachakra Press, SAMALKOT.